# ఏకైక వీరుడు

జూలై 17.1

నర్తకి ప్రతిరోజూ పొద్దున ఆశ్రమానికి వెళ్ళి
గికి నమస్కరించి వొస్తుంది. తోవలో పాలితీర్థం
కాకుల గోల వినవచ్చింది. చూస్తే దూరంగా కాకుల
కనపడింది. తన వెంట వొస్తున్న కరప్పని వెళ్ళి
చూడమంది. అతను చూసి ఆదుర్దాగా "కురివి, కురివి"
పిట్ట) అని అరిచాడు. నర్తకి పరిగెత్తుకుని వెళ్ళింది.
వెల్లకితలా పడి తనచుట్టూ గుమికూడి పొడుస్తున్న
మిది కాకమ్మలతో ఏకైక వీరుడై పోట్లాడుతున్నాడు
కని కాకుల్లోంచి పైకి తీశాడు కరప్పన్. నర్తకి అతని
ల్లోంచి ఈ వీరుణ్ణి తీసుకుని రొమ్ము కద్దుకుని సముదా
ఇంటికి తీసుకొచ్చింది. వరండాలోకి వొస్తున్న పకపక
నర్తకి చేతుల్లోంచి తీసుకుంది. నర్తకి అతని కథ
వుండగానే ముందు షా అతనికి పాలుపట్టింది. బాగాతా

అతను చిన్నపిల్లవాడు ఇంకా. గూట్లోంచి పడ్డాక
అతన్ని తీసుకునివెళ్ళి అతని గూట్లో పెట్టాలంది
కాని గూడెక్కడ? ప్రస్తుతానికి అతన్ని, మెస్టన్
కబ్బర్డులో కింద అరలో పెట్టారు.

నాన్న వొచ్చి చూశాడు. "సరే. ఇది
ఎన్ని వచ్చాయో, ఎన్ని చచ్చాయో! వీడొకడు! బతికి
పడి యెగిరి పోయినప్పుడు కద" అని వెళ్ళిపోయినాడు.



మూడు గంటలకోసారి పాలు పడుతున్నారు. కళ్ళు
బద్ధకంగా నిద్రపోతున్నాడు. పెద్ద గాయాలేం కన
డు. మెడదగ్గరా, రెక్కల కిందా గీసుకుపోయినట్లు
లేని స్థలాలు కనిపిస్తున్నాయి.

# కబ్బర్డ్‌లో గోరింక

జూలై 18

నాన్న తెల్లారకట్టే లేస్తాడు. గోరింక బతికి వున్నాడో
తొంగి చూశారు. కబ్బర్డులో ఓ మూల కూచుని
న్నాడు గుడ్లిప్పి చూస్తో అతను.

మళ్ళీ పాలు పట్టింది షా. తెల్లారాక, రొట్టెని పాలలో
నానేసి నోట్లో పెట్టింది. తిన్నాడు. రెక్కల కింద యెర్రగా
వున్నచోట గాయమేమోనని మందు పూసింది పకపక.
మందుని అసహ్యించుకుని అందినంతవరకు ముక్కుతో
సేసుకున్నాడు.

అతని ఆహారమేమిటో తెలీలేదు. ఉత్తపాలలో నానే
సిన రొట్టె పైనే బతకడేమోనని అనుమానం.

సాయంత్రాలు షికారు వెళ్ళినప్పుడు కొండపక్కమైదా
నాల్లో గోరింకలు గుంపులుగా కూచుని వుసుళ్ళని తినడం
చూశారు. వాన పడ్డప్పుడు చదలే వుసుళ్ళవుతాయి. గనక

యితను చదలు తినవొచ్చునని ఆలోచించింది న
అదివరకు చాలాసార్లు చదలు పెట్టి పెంచింది
చదలు దొరకడం సులభం. ఇంటిచుట్టూ చదలే.
యిల్లు వూరిబైట చుట్టూ కొండా, అడవీ, ఇంటిప
పెద్ద మైదానమూ, చిన్న చిన్న పొలాలు, ఎదురుగా
చలం. అక్కడంతా అడివి. ఇంటిలో యేది కిందప
పొన్నులో వెంటనే చదలు తినేస్తాయి, ఆరేసిన బట్టల్ని

బొగ్గుల పెట్టె వెనక చదల్ని పట్టి, వాటిని
చేసి గోరింకకి తినపెట్టింది నర్తకి. ఇష్టంగా తిన్నాడు.

అది చూశాడు కరప్పన్. అతనికి కోపంగా
నిన్నటినించి తాను పట్టిన పిట్టని లాక్కుని ఆ
అతనికేమీ భాగం లేకుండా చేసి, అతనికన్న
గొప్ప చేసుకోవడం "ఏమిటాపిట్ట గొప్ప! ఏముంది
ఎక్కడ చూసినా ఈ పిట్టతే! దానికి పాలు, రొ
అన్న తృణీకారంతో చూస్తున్నాడు. ఎదురు గుడిశ
అన్నామలైకి ఈ పిట్టని చూసి నప్పటినించి ఆశగా
అది యెప్పుడు చచ్చిపోతుందా, తాను దాన్ని
తినవొచ్చునని. కాని కరప్పన్ చచ్చినా దాన్ని అన్నా
దాకా రానిచ్చేట్టు లేడు. చదల్ని చంపి పెడుతో
కరప్ప "ఒక్క ప్రాణాన్ని బతికించడంకోసం
ప్రాణాల్ని తీస్తున్నారా?" అని నిందించాడు. ఆ ప్ర



చాలా వేదాంతం వుండనువచ్చు. భూతదయపైనా, ఈ సృష్టి పద్ధతిపైనా, చాలా ప్రశ్నలు వొస్తాయి ఆలోచించినకొద్దీ.

గోరింక రోజల్లామత్తుగా నిద్రపోతున్నాడు కబ్బర్డులో, రొట్టె పాలూ తిని. చంచాతో పడితే నీళ్ళు కూడా తాగుతున్నాడు. అన్ని పిట్టల చార్జీ తీసుకున్నట్లే పకపక ఇతని పెంపకం, బాధ్యత కూడా తానే తీసుకుంది.

## ఎవరే నీవెవరే?

జూలై 19

ఇవాళ మధ్యాహ్నం గోరింకకి మత్తు వొదిలింది. నోరు తెరిచి రొట్టె కావాలని అడిగాడు. ఇదివరకు పాలలో నానిన రొట్టె అతని నోట్లోకి తొయ్యాలి, ఇప్పుడు నోటి కందించగానే తనే తిన్నాడు.

కొంచెంసేపు వుండి పంజరంలో వుండనని బైటికి వొస్తానని అశాంతిగా కొట్టుకుని కబ్బర్డులో యిటూ, అటూ తిరుగుతున్నాడు. పకపక కోప్పడ్డది "రాపడానికి వీల్లేదు. గోల చెయ్యకు" అని. వూరుకుని ఓ మూల కూచున్నాడు.

కాని కాసేపటికి మళ్ళీ గోల. కబ్బర్డు పక్కల యినప తీగెల్ని ముక్కుతో పీకుతున్నాడు. ముక్కంతా రక్తం.

రాత్రి ఆలోచించారు ఏం చెయ్యాలని. అ
అతన్ని తీసుకుపోయి పాలితీర్థం దగ్గర వొదలా
అతని తలిదండ్రులు యితనికోసం చూస్తో వుంటా
చూడగానే వొచ్చి తీసుకుపోతారనీ వారి సలహా.
గోరింక చిన్నపిల్ల కాదనీ, పెద్ద వాడేననీ అతని
అక్కడ వుందని అక్కడ వొదిలితే గూట్లోకి వె
దని వొకరి థియరీ.

ఈ థియరీలని చూసి నవ్వాడు నాన్న.
పొద్దున్నే యింటిముందు యెగరేసి చూద్దామంది శా.

ఇంటి ముందు పెద్ద శిరీషవృక్షం, మామి
ఎదురుగా. పక్కనా బోసు కాంపౌడు చెట్లు, తురాయి,
ఎదురుగా పల్లాకుత్తు అడివి. దాని వెనక అరు
అడివి. అతనికి యెగిరిపోవడానికి అంతా అడివే.

తిరిగి చర్చించారు. చివరికి గోరింకని పా
ఒడ్డున వొదిలి ఎగిరి ఏ గూట్లోకన్నా వెడతాడోలేదో
మనుకున్నారు. దాని గూడు కనబడితే, ఆ గూట్లో వొ
దామనీ ఆలోచించారు. ఆ పని చెయ్యడానికి
వాలంటీర్ చేసింది.





పొద్దున్నే నర్తకి గోరింకని పాలితీర్థం దగ్గిరికి తీసుకుని వెళుతోంది. నర్తకిని నాన్న వెనక్కి పిలిచి, "ముందు గోరింకని యిక్కడే వొదిలి యే మాత్రం యెగరగలడో చూద్దాము"న్నాడు. అందరూ నుంచుని గోరింకని యెగరేశారు. అతను ఎగిరి కాంపౌన్డు గోడమీద వాలాడు. దాని మీదనుంచి పక్క బంగళాలోని బిల్వం చెట్టుపైకి గంతేశాడు. అతని వాలకం చూస్తే అంతకన్నా యెగరలేడని తెలుస్తోంది. అతన్ని పాలితీర్థం దగ్గర వొదలడం ప్రస్తావన పోయింది. కరప్ప చెట్టెక్కి అతన్ని పట్టుకుని తీసుకొచ్చి యిచ్చాడు. అదంతా చూస్తున్న పరశురాం అన్నాడు. "ఇట్లా వొదిలారంటే క్షణంలో మీకు అందకుండా వెడతాడు."

"వెళ్ళాలనేగా మా వుద్దేశ్యం" అన్నారు.

"కాని అందకుండాపోయి తన సంగతి చూసుకోలేక చచ్చిపోతాడేమో" అన్నాడు నాన్న.

"సాయంత్రాలు షికారు పోయేప్పుడు మనతో తీసుకుని వెళ్ళి మైదానంలో గోరింకల దగ్గిర వొదిలితే వాటితో కలసి యెగిరిపోతాడు" అన్నాడు జగన్నాథం.

"అదికాదండి ఒకటి చెయ్యండి అతని కాలికి ఓ దారం కట్టండి. అతను కొంచెం దూరం, యెత్తుగా యెగిరినా, దారం సహాయంతో అతన్ని పట్టుకోవచ్చు నన్నాడు" పరశురాం. బావుంది సలహా అనుకున్నారు అందరూ.

"మైదానంలో గోరింకల దగ్గర వొదిలితే! గో
యెగరడం చూసి యితనికి వుత్సాహం కలిగి వాటితో
పోతాడు. అవే యితన్ని రక్షించుకుంటాయి" అన్నా
న్నాథం. 'మనుషులు తాకిన పిట్టని తక్కిన పిట్టల
వ్వవు" అన్నారు వొకరు.

"ఇక్కడ యెగరలేనివాడు అక్కడ యెగురు
అని నాన్న. "పోనీ మైదానానికి తీసుకువెళ్ళి చూ
అని నిశ్చయించుకున్నారు.

మైదానంలో ప్రతి సాయంత్రం గోరింకలు గుం
వుండేవి. ప్రక్కనున్న చెట్లనిండా అవే. ఈ
గోరింకలు ఎక్కువ. అదివినించి సాయంత్రం వూళ్ళో
మైదానంలో వాలి పురుగుల్ని యేరుకు తిని, రాత్రి
వుంటే వూళ్ళో ప్రవేశిస్తాయి. జగన్నాథం సూ
అందరూ అంగీకరించారు.

అతన్ని పగలంతా మళ్ళీ కబ్బర్డులో పె
చదల్ని నర్తకి పెడితే ఆయన బాగానే పుచ్చుకున్నాడు

సాయింత్రానికి కొంచెం ముందు వాన కురిసిం
సంగతిముందే తెలిసింది పిట్టలకి, వర్షం రాబోతుం
కాకులూ! గోరింకలూ వాళ్ళ యింటిమీదిగా వూళ్ళోకి
వెళ్ళాయి. ఎట్లాగూ మైదానంలో గోరింకలు చేరవని
తమ గోరింకను షికారు తీసుకుపోలేదు.





# మైదానంలో మునీశ్వరుడు

జూలై 21

కబ్బర్డు తీగెల్ని కొరుక్కుని ముక్కంతా రక్తం కారుతోనే
వుంది. పరశురాం సలహా ప్రకారం గోరింక కాలుకి తాడు
కట్టి, భోజనాల గదిలో వొదిలారు. అక్కడ పొద్దున్న షా
కూరలు తరుగుతో వుంటుంది. ఎవరో వొకరు వుండనే
వుంటారు. పిల్లులూ అవీ రాకండా చూస్తారు.

గోరింక తాడుని లాక్కుంటో యిటూ అటూ కొంచెం
తిరిగి స్టౌ (stove) బల్లకింద దూరి అక్కడ కూచున్నాడు.
క్షేమంగా వున్నాడుకదా అని అతన్ని అట్లానే వుండ
నిచ్చారు.

సాయంత్రం సౌరిస్, నాన్న, నర్తకి, కురంగేశ్వర్,
జగన్నాథం మామూలు ప్రకారం షికారు బైలుదేరారు.
నాన్న కాలుకి కట్టు కట్టుకున్నా ఓ అరమైలుకన్న నడవ
లేడు. అందుకని అరమైలు కాగానే వున్న ఓ కొండపైన
కూచుంటారు

కొండ కొంచెం యెక్కగానే ఓ పల్లం వుంది. మధ్యలో
చదునైన భాగం. అంతా (granite) గట్టిరాయి. దాంటో
పల్లాలు, వాన కురిస్తే స్వచ్ఛమైన నీరు చేరుతుంది. వాటిల్లో
అరుణాచలానికీ, ఈ కొండకీ మధ్య అరుణాచలం పాదం

లోని చిట్టడవి. చిన్న మైదానం, దాని పక్కన రో రోడ్డుకి కొంచెం దూరంలోనే ఈ కొండ. రోడ్డుమీద కార్లు, బస్సు, బాటసార్లు కనబడుతూ వుంటారు.

పైన సాయంత్రపు ఎండ, అరుణాచలం పైన రంగుల్ని చూస్తో కూచుంటారు. ఈ కాలంలో వానలు కురిసి పర్వతం ఆకుపచ్చగా మారింది, గో కురంగేశ్వర్ తన చేతుల్లో పట్టుకుని తీసుకొని వొ లక్కీ వెంట వొచ్చాడు. లక్కీ (కుక్క) తెలివిగల పూరకుక్కైనా వాళ్ళు పెంచుతున్న పిల్లుల జోలికి, జోలికి రాదు. కాని మనుష్యులు; వాళ్ళు ఆ నమ్మరు. గోరింక ఇంట్లో తిరుగుతో వుంటే కోరమ చూస్తున్నాడు. గోరింకని అట్లా తనచుట్టూ స్వేచ్ఛగా నియ్యడం తన ఆత్మగౌరవానికి భంగమనే ఆలోచన వొస్తున్నట్టు కనబడుతోంది.

"ఇప్పుడు దీన్నో దాన్ని పట్టుకొచ్చారా? కా అంటున్నాయి అతని చూపులు. అతని ఆత్మనిగ్రహ మరీ (strain) చెయ్యకూడదని గోరింకని అతనికి దూ గానే వుంచుతున్నారు.

ఒక పక్కన ద్రౌపది ఆలయం వెనుక అరుణాచ రెండు పక్కల చిట్టడవి. దక్షిణాన రోడ్డు, వాటిమ మైదానం పడుకుని వుంది, ఆకాశం వంక చూస్తో.



గోరింకలేదు. రోడ్డుపక్క చెట్లమీద అక్కడక్కడ రెండు మూడు కూచుని మాట్లాడుకుంటున్నాయి.

గోరింకని ఎత్తుకుని షికారువెళ్ళి, తిరిగి వొస్తో ఏం చేస్తాడో చుద్దామని అతన్ని మైదానం మధ్య వొదిలారు వాళ్ళందరూ పోయి దూరంగా కూచున్నారు. ఆ గోరింకలు వొచ్చి అతన్ని తీసుకెడతాయేమో చూడాలని గోరింక మైదానంమధ్య కదలక, మెదలక అట్లానే కూచున్నాడు. సాయంత్రమౌతుంది. చీకట్లో దూరంగా ఓ మునీశ్వరుడిలా కనిపిస్తున్నాడతను. జాలివేస్తోంది అతన్నిచూస్తే. అతనికేం చాతకాదు. ఎవరూ దిక్కులేరు అతనికి. వెళ్ళిఅతన్ని తీసుకునియింటికి తెచ్చేశారు.

## చిన్న పిట్ట పొడుగు మనిషి !

జూలై 22

పగలు పడలడంతో తీగెలు కొరికి నెత్తురు కారడం తగ్గింది. ఇవాళ పక పక వెంట తిరుగుతున్నాడు. ఎంత సేప టికీ పక పక వొళ్ళో కూచుంటానంటాడు పక పక గంజి కాస్తో వుంటే ఆ వేడి గంజి పడుతున్న గిన్నెలో దూక బోయినాడు.

అతని కాలికి తాడు అట్లానే వుంచారు, ఆపా
వెళ్ళకుండా. ఇవాళనించి అతను తేనె, పళ్ళరసం
చేస్తున్నాడు.

పకపక అతన్ని ప్రేమగా "బుజ్జిగా" అని పిలు
అతనికి ఆ పేరే ఖాయమయ్యేట్టుంది.

సాయంత్రం నాన్నా, సౌరిస్, కురంగేశ్వర్,
న్నాధం వెళ్ళారు షికారు. చేతులతో తీసుకొని వెడితే,
వేడికి కందిపోతున్నాడని, ఓ తీగెల బుట్ట వుంటే
పెట్టి తీసుకుని వెళ్ళారు బుజ్జిగాడిని. మైదానం దగ్గ
అతన్ని వొదిలారు. కాలికి తాడువుంది. ఆ twineని
కుంటో తిరగడం ప్రారంభించాడు. ఏ ఆపాయం రాకు
అతని వెంట జగన్నాధం. ఈ చిన్నపిట్ట, ఆ పిట్టవెంట
గాటి మనిషి. పిట్ట అరుణాచలం వైపు పోయింది. వాళ్ళ
సాయంత్రమంతా తిరిగారు. చదలు యేరుకు తింటా
నన్నుకున్నారుగాని, అతను తిరగటం తప్ప తినలేదు.
మేధ అశ్వమూ వెనక తిరిగే క్షత్రియ యోధుడూలాగు
పించారు వాళ్ళిద్దరూ.





## బుజ్జిగాడి సంతోషం!

జూలై 23

కురంగేశ్వర్, జగన్నాధం బుజ్జిగాడి మీద శ్రద్ధ
చూపుతున్నారు. నర్తకి, వాళ్ళిద్దరూ పొద్దస్తమానం చదల
సం వెతుకుతున్నారు.

మనుషులు భోజనాల యింట్లో లేనప్పుడు, కబ్బర్డులోకి
ళ్ళమంటే వెళ్ళటంలేదు. బలవంతాన పంపితే లోపల
మని స్వేచ్ఛకోసల తీగెలు కొరుకుతున్నాడు. ముక్కంతా
క్షతమయమై పుండుపడ్డది. ముఖ్యం అమ్మ హృదయం తల్ల
పోతోంది. తనకి తెలీకండానే బుజ్జిగాడి మీద ప్రేమ
స్తోంది అమ్మకి. రాత్రి అందరూ సమావేశమైఆలోచించారు-
ం చెయ్యాలని. కబ్బర్లులోపల అన్నిపక్కలా గడ్డి పేరుద్దా
న్నారు. సిల్కు కర్టెన్లు కట్టాలని ఒకరూ, ముక్కుకి
బ్బరు తొడగాలని నాన్న.

ఈ మధ్య ఒక పిచిక అద్దంముందు చేరింది. పొద్దస్త
మానం తన పాపని అద్దంలోచూసుకుని, ఆ పాపతో మాట్లా
డుకుంటో వుంటుంది. ఎప్పుడో ఓ నిమిషం వెళ్ళి పంటింట్లో
గింజలో, మెతుకులు యేరుకుని వచ్చి, అద్దంముందు కూచుం
టుంది. ఆ పిచికని చూసి నాన్న తాను అట్లా అయిపో
కూడదా అని కలలు కంటున్నాడు ఈర్ష్యతో.

మధ్యాన్నం పకపక బుజ్జిగాణ్ణి ఒళ్ళో కూచోపెట్టు
కుంది. అతను ఒకటే పెద్దపెద్ద అరుపులు భయపడ్డది. అతని

తేమన్నా బాధో వ్యాధో అని. ఇంతా చేస్తే అవి పచ్చి అరుపులు అని షా చూసి చెప్పింది. బుజ్జిగాడికి షపట అంత ప్రేమ. దింపెయ్యగానే అరుపులు మానేశాడు. కూచోపెట్టుకుంటే మళ్ళీ సంతోషంగా అరిచాడు.

పొద్దున్న షా కూరలు తరుగుతో వుంటే భుజం కూచుని అరుపులతో, రెక్కల విదిలింపులతో సంతోష చూపుతాడు. క్రమంగా మనుషులకి అలవాటు పడుతున్నా ఏమన్నా బలవంతం చేస్తే తప్పించుకుని షా తల భుజంమీదో కూచుంటాడు. వాళ్ళ నించి వెళ్ళిపో ప్రయత్నమే లేదు అతనిలో.

## రెక్కలురావు

జూలై ...

పగలు బుజ్జిగాడు స్టౌమీద కూచుంటున్నాడు. అతని దగ్గరగానే వుంది రేడియో. అది పాడుతో వుంటుంది ... సేపు. అతను ఇవాళ రేడియో పెట్టిన బల్లమీదికి దూకి రేడి... పాట వింటున్నాడు. అప్పుడప్పుడు ఆ పాటతో కలిసి ... టుక్ అంటాడు.

ఇవాళ సాయంత్రం మైదానం దగ్గరే ఆగిపోయినా... బుజ్జిగాడికోసం సర్తకి మైదానంలో వెతికి చదల పుట్టలు...



...బుజ్జిగాణ్ని తీసుకువెళ్ళి చదల్ని చూపించింది. కాని సరిగా తినలేదు. అతని తలని కిందికి వంచి, సర్తకి తన వేలితో చదల్ని పొడిచి చూపుతో వుంటేనేగాని తినలేదు. అట్లా మైదానంలో వెతుకుతో వెడుతోంది సర్తకి. బుజ్జిగాడు వెంటవెళ్ళి...టున్నాడు. ఈ సాయంత్రమూ గోరింకలు రాలేదు-మైదానములోకి. మైదానానికి గోరింకలు వచ్చే రుతువు అయిపోయినట్టుంది.

అతను ఎగరాలనే ప్రయత్నమే మానుకున్నాడు. అతని రెక్కలకి యింకా యెగిరే బలం లేనట్టుంది. రెక్కలకి త్వరగా బలం వచ్చేట్టు, ఈ లోపల అతనికి సాయంత్రాలు Flying Practice యివ్వాలని నిశ్చయించారు.

జూలై 25

## ఆషా అభిమాని

ఇవాళ నించి రొట్టెని అడిగి తింటున్నాడు అంటే ఒక ఒక దగ్గిరికి వెళ్ళి రొట్టె పెట్టమన్నట్టు నోరు తెరుస్తాడు. గంట గంటకీ ఆహారం పెట్టాలి అతనికి. అందరూ దొడ్లూ, వాకిళ్ళూ వెతుకుతున్నారు చదల కోసం. చదల Culture పెట్టాలని ప్రయత్నం. అంటే చదలు తినే తాటాకులు, బట్టలు, పీలికలు, వెదుళ్ళు మొదలైనవి చదలువున్నచోట

రాత్రి పెట్టడం. రాత్రి చదలు పడతాయి వాటి
భోజనానికి తయారుగా.

రేడియోలో అతనికి ఆషా Records యిష్ట
సింది. ఆమె రికార్డు రాగానే సంతోషం కనపరుస్తా
కికీ అని అరవడం, రేడియోలోకి చూడడం, రెక్క
కోడం, ఇటూ, అటూ దూకడం యిట్లాంటివి.

సాయంత్రాలు షికారు వెడుతో వుంటే
కురంగేశ్వరరావుకీ, జగన్నాధానికి తోవ వెంబడి
కుప్పల మీదనే దృష్టి. ఇప్పుడు చదని దూరం నించే
పట్టగలరు. బుజ్జిగాడిని ఆ చదల దగ్గర పెట్టి తిని
తక్కిన వాళ్ళంతా ఆగి నించోవాలి – ఆయన
అయిందాకా.

ఇవాళ సాయంత్రం తమతో పాటు అతన్ని
మీదికి తీసికెళ్ళారు. అక్కడ రాతిగుంటలో చేరిన
నీటిలోకి దూకి అతను సంతోషపు అరుపులతో
విదిల్చుకుంటో స్నానం చేశాడు. అతనికి Flying Pra
యిద్దామని జగన్నాథం, కురంగేశ్వర్, ఒకరినించి
అతన్ని యెగరవేశారు. అతని కాలితాడు ప్రతిదానికి
పడుతోంది. అందుకని తాడుని పొట్టి చేశాడు.

బుజ్జిగాడు అలసిపోయినప్పుడల్లా వెళ్ళి
మీద కూచుంటాడు. ఈ షికార్లకి పకపక రావడంలేదు



## రేడియో జ్ఞాని

జూలై 26

గలు చాల భాగం పై తిరుగుతున్నాడు మనసుల్లో.
హ్నం వాళ్ళు వేరేగదిలోకి వెడితే తనూ వాళ్ళ వెంట
తున్నాడు. ఓ కుర్చీ వీపుమీద యెక్కి కూచుని కీచ్
అంటో వుంటాడు. రేడియో పాడుతున్నంతసేపూ
ముందే కూచునివుంటాడు. ఆపితే రేడియోని
ముక్కుతో పొడుస్తాడు పాడమని. రేడియో వింటో
సంలో పడ్డట్టు నిశ్చేష్టితుడై, గుడ్లుకూడా ఆడడంమాని
గా వింటాడు.

సాయంత్రాలు పంజరం అవసరంలేదు. భుజాలమీద
మని పోస్తున్నాడు షికారు. ప్రతి రోజూ మైదానానికి తీసు
పోయి చదలు తినిపిస్తున్నారు నర్తకీ, కురంగేశ్వర్,
జగన్నాథం. చదల భోజనమైనాక రోడ్డు పక్కన వొకరి
కొకరు దూరంగా నుంచుని కురంగేశ్వర్, జగన్నాథం
అతన్ని యెగరేసి Flying Practice యిస్తున్నారు.

## తలలపై సవారీ

జూలై 27

బుజ్జిగాడికి స్తాపైన యెక్కి కూచోడం యిష్టం. అతనికి
పెట్టడానికి పకపక రొట్టె తీసుకురాగానే యెక్కడ వున్న

వాడూ స్టూలుపైకి యెక్కి కూచుంటాడు. ఇంకోచో
తినడు. అది అతనికి భోజనాల బల్ల.

ఇప్పుడు రేడియోలో లతపాటలు కూడా
తున్నాడు. తనకి యిష్టంలేని పాటలు వొస్తే
దూరంగా సంబంధం లేనట్టు కూచుంటాడు.

ఇల్లంతా తిరుగుతున్నాడు. షా ధ్యానంలో
ఆ గదిలోకి వొచ్చి షాకి దగ్గరగా గంటపైన
చూచుంటాడు. ఇంట్లో అందరి తలలపైనా సవారి
అతనికి యిష్టం.

సాయంత్రం నర్తకివెంట రోడ్డుపక్కన
న్నాడు తనంతట తాను చదల్ని వెతుక్కుంటో
చదలపుట్టని చూసుకొని ఆగినా నర్తకి వేలుపెట్టి
గాని చదల్ని చూసుకుని తినడు. బుజ్జిగాడికి దృష్టి
మనీ, వాడి కళ్ళు పరీక్షచేయించి, సులోచనాల జోడు
చాలనీ అంటున్నారు జగన్నాధం. ఓ Lens లోంచి
Magnify చేసి చూపాలన్నారు కురంగేశ్వర్.

Flying Practice తీసుకుంటున్న బుజ్జిగాణ్ణి
వింతగా చూస్తున్నారు బాటసారులు. రోడ్డుపైన నర్తకి
అతను కుక్కలాగ పరుగెత్తుతో వుంటే వింతగా
బాటసారులకి.



## ఇంకో (ట్రో) మనిషి

జూలై 28

కాలి దారాన్ని బుజ్జిగాడు ముక్కుతో వొకటే పీక్కుం
టున్నాడు. ఆ తాడు వుండడం తనకి అవమానంగా Feel
అవుతున్నట్టున్నాడు. రెక్కలకి యింకొంచెం బలంవొస్తే
తాడు విప్పేసి అతనికి స్వేచ్ఛ నియ్యాలనుకుంటున్నారు.

ఇవాళ యెవరూ షికారు పోలేదు. ఇప్పుడు ఇంటిల్లి
పాదికీ అతను Darling బనాడు. ఎప్పుడూ అతని సంగ
తే మాట్లాడుకోవడం. నాన్న తన మిత్రులకి రాయడం.
అతని సంగతులు యింకో మనిషి కిందే మాట్లాడుకుంటు
న్నారు.

## స్వేచ్ఛకోసం గోల

జూలై 29

తనకి స్వేచ్ఛ నిమ్మని చాల గోల చేస్తున్నాడు.
ఆకాశంవంకా, చెట్లవంకా, ఎగిరే పక్షులవంకా కాంక్షతో
చూస్తున్నాడు. బంధంలోవున్న పక్షుల ఆరాటం చూసినప్పుడు
అర్థమౌతుంది. ఆకాశంలో యెండలో యెగరడం, ఆకుల
మీదల్లో కూచోడం పక్షులకి ఎంత ఆనందమో!

ఇంక అతను వెళ్ళిపోవాలని కోరుకుంటున్నాడనీ,
కట్టిపడేసి వుంచడం క్రూరమనీ, అపాయంలోకి వెళ్ళినా అతని
స్వేచ్ఛ అతనిదనీ డిస్కస్ చేసుకున్నారు.

ఆషా, లతా రేడియోలో పాడుతూవుంటే వాళ్ళతో కలిసి పాడుతున్నాడు. రికార్డు అయి తనూ ఆగుతాడు. ఇవాళ్ళ షికారు వెళ్ళేముందు తప్పించుకొని షా భుజంమీద వాలి; అక్కడ నించి మీదికి యెగిరాడు. పకపకకి చిక్కాడు చివరికి.

సాయింత్రం షికారు వెడుతోవుంటే అతను వెనకనే నడుస్తున్నాడు. బాటసారులు అతన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు. సరదాపడి అతని సంగతులు తెలుసుకున్నారు. వాళ్ళలో వాళ్ళు నిలిచి మాట్లాడుకుంటూ ఒకరు మైనాపిల్లని తెచ్చిపెడతామన్నారు.

కొండమీదికి వెళ్ళారు. ఎండకి గుంటలలో నీళ్ళు పోయినాయి. తను ఆ రోజు స్నానం చేసిన ఆ గుంట నీళ్ళకోసం వెతుక్కున్నాడు. కురంగేశ్వర్, జగన్ కొండ దిగివెళ్ళి మంటపంలో కూలివాళ్ళని బతిమాలి నీళ్ళు కొండపైకి మోసుకొచ్చి గుంట నింపారు. స్నానం చేశాడు. Flying Practice లో బాగా దూరంగా ఎత్తుగా ఎగిరి పైన కూచున్నాడు.



## పకపక ప్రేమ జూలై 30

మధ్యాహ్నం బుజ్జిగాడు దారంతోనే యింట్లోనించి నిచ్చెన మీద కూచున్నాడు. ఇంట్లో బాగా ఎగురుతున్నాడు గదినించి గదికి. ఎల్లుండి పొకటో తారీఖున అతనికి స్వేచ్ఛ నియ్యాలనుకున్నారు.

సాయంత్రం కొండమీది కెళ్ళారు. దోవలో మళ్ళీ మనుషులు విరగబడి చూస్తున్నారు. అతను కుక్కపిల్లమల్లే వెంట నడవడం, పిలిస్తే రావడం, మాట్లాడడం, అన్నీ వింతగా ఆగి చూస్తారు. పికిలి పిట్టలు మనుషుల వెంట నడవవా, చిలకలు జాతకం కాటాకులు తియ్యవా? ఇన్నీ చూసికూడా బుజ్జిగాణ్ణి వింతగా చూస్తున్నారు. అతనిలో ఏదో ప్రత్యేకత వుందో యేమో! లేక వాళ్ళమీది అతని ప్రేమలోనే వుందో! అతనికి యింటివాళ్ళ అలవాటేకాదు వాళ్ళమీద ప్రేమ. ముఖ్యం పకపకపైన.

## వదలడానికి వీల్లేదు జూలై 31

సాయంత్రం మబ్బులుగావుంటే కొండ మీదికి వెళ్ళక రోడ్డుపక్కనవున్న పుల్లయార్ కోవెలలో కూచున్నారు.

కొండమీద గుంటలో స్నానం బుజ్జిగాడు (Miss) అవుతున్నాడని. కురంగేశ్వర్, జగన్నాథం, అతన్ని కుని వెళ్ళి మోజ కాలవ నీళ్ళలో స్నానం చేయించి కుని వచ్చారు.

బుజ్జిగాడు భుజంమీద కూచుని చంపల్ని ముద్దు న్నాడు. ముసలి అతను యిదంతాచూసి బుజ్జిగాడు ప లన్నీ కనుక్కుని "ఇదేమిటి? అడివిలో పిట్ట మని ముద్దులాడడం? దోసెలు తినడమేమిటి? భుజాలపైన ష షికార్లు! ఎంత అదృష్టం చేసుకుంది!" అని చాలా ఆ పోయినాడు. ఎంతసేపో ఈ జీవితమూ, ప్రేమలూ, మనుషులూ వీటి సంగతులు మాట్లాడాడు.

తిరిగి ఇంటికి వొస్తోవుంటే తోవలో చినుకు వొచ్చాయి. ఆ చినుకులు పడుతోవుంటే కుక్, కుక్ అ గోల బుజ్జిగాడు నర్తకి భుజంమీద కూచుని.

మర్నాడు బుజ్జిగాడికి స్వేచ్ఛ నిద్దామనుకున్నా ఇదివరకంతా అతని కాలికి చైను కట్టే వుంది. దూర యెగిరి పోకుండా చూస్తోనే వున్నారు. ఎగిరితే ఆ చైను వెనక్కి తీసుకురాగలరు. ఇప్పుడు ఆ చైనుతీసేసి లేద్దామని, అతని యిష్టం యెక్కడికన్నా వెళ్ళనీ, పోతాడు మళ్ళీ కనపడడని కొందరన్నారు. కొందరు వెళ్ళదనీ, వెళ్ళివొస్తో వుంటాడని కొందరు. ఏమైనా అ



పండగ దాకా విడవకూడదని నాన్న. ఎందుకంటే ఆ డక్కి డాలీ వొస్తుంది మద్రాసు నుంచి. ఈగోరింక సంగతి రాడు తను. డాలీ వచ్చేప్పటికి గోరింక లేకపోతే Disappoint అవుతుంది అని నాన్న. అమ్మ అతన్ని అసలు కానికి వీల్లేదంది. వదిలితే అడవిలో అతనికి రొష్టె ట్లా? కాకులు పొడిచి చంపేస్తాయి. ఎట్లా తనంతట తను తిండి సంపాయించుకుంటాడు? వదలడానికి వీల్లేదంది.

## తిరిగి దొరికిన బుజ్జిగాడు

అగష్టు 1

ఎవరన్నా దగ్గిర వున్నప్పుడు తప్ప బుజ్జిగాణ్ణి ఒంటరిగా స్వేచ్ఛలో వదల వద్దని చెప్పింది షా. పొద్దున్నే హామీలు ప్రకారం కబ్బర్డు తలుపుతెరిచి అతన్ని వదిలేసింది కపక. పనులు చేస్తో, నాన్న అక్కడే తిరుగుతున్నాడు కా అని! బుజ్జిగాడి గమనిక లేకుండా నాన్న అవుదూడ బజ్జాయిని చూడ్డానికి వెళ్ళిపోయినాడు. బుజ్జిగాడు కిటికీ లోంచి యెగిరిపోయినాడు కనపడలేదు. తిరిగి రాలేదు. అమ్మా, పకపకా, రోడ్లవెంటా, దొడ్లవెంటా, తోటలవెంటా వెద్కారు. 'బుజ్జిగాడూ, బుజ్జిగాడూ' అని బిగ్గిరిగా పిలుస్తో.

వెతికి వెతికి పకపక దిగాలుపడి తిరిగి వొచ్చి
కూచుంది. ఎక్కడన్నా కనపడతాడేమోనని
ఇంతలో కురంగేశ్వర్, జగన్నాథం బుజ్జిగాడి కోసం
పట్టుకుని వచ్చారు. అతను వెళ్ళిపోయాడన్న వార్త
వాళ్ళ మొహాలు తెల్లపడి పోయినాయి. ఆ దబ్బా
పడేసి కాఫీ అన్నా తాగకుండా షికారు తోవంతా
వెతుకుతూ బయలుదేరారు. బుజ్జిగాడు దొరుకుతాడని
తోంది షో. చుట్టుపక్కల వాళ్ళూ, రోడ్డుమీద వా
వీళ్ళకి ఏం వుపద్రవం వొచ్చిందోనని నిలబడి చూస్తున్నా

నాన్న తిరిగివొచ్చి ఈ సంగతి తెలుసుకొని
బుజ్జిగాడికోసం వెతికాడు. నర్తకి ఆశ్రమంనించి
వెతుకుతోంది.

అతను వెళ్ళిపోతే అంత దిగులు పడరు. కాని
కాలుకి వైను వుంది. అది ఏ చెట్టు కొమ్మకో మెలిక
తుంది. అతను కదలలేక, ఎగరలేక, మాడిమాడి Slow
చచ్చిపోయేదాకా ఎంత బాధపడతాడోనని వాళ్ళ
మంతా.

చివరికి తొమ్మిదిగంటలకి కనపడ్డాడు
నర్తకికి. పల్లాకుత్తు అడవి ప్రక్కన ఓ చెట్టుమీద
వున్నాడు. తాడు మెలికపడింది కొమ్మకి. వెతుకుతు
వీళ్ళ కంఠాలు విని ఆ కొమ్మమీద నించి అరిచాడు వా



కోసం. ఆ పక్కనే వెతుకుతున్న కరప్పాయిని పిలిచి చెట్టె
క్కించి బుజ్జిగాడి తాడును వదిలించాడు. వదలగానే గాలిలో
ఒక పల్టుంచుట్టి పకపక భుజంమీద వాలాడు.

అతను యింటికిరాగానే యెంత గంతులేశారో! ఆ
రోజు రూఢీగా తెలిసింది ఎంతగా అందరి హృదయాల్ని
దోచేసుకున్నాడో బుజ్జిగాడు! వెంటనే అతని కాలు వైనుని
తీసేసి అతనికి స్వేచ్ఛ నిచ్చేశారు. కాని అతను మళ్ళీ
ఎగిరిపోలేదు.

## రోజల్లా తలుపుమీద — ఆగష్టు 2

నిన్నటి తన యెడ్వెన్చర్‌తో దడుసు కున్నాడో
ఏమిటో, ఎక్కడికి బైటికి కదలలేదు అతను. రోజల్లా తలుపు
మీద యెక్కి కూచున్నాడు. వేళకి రొట్టె తింటాడు. రేడియో
వింటాడు. సాయంత్రం షికారు తీసుకుని వెళ్ళారు. అతను
ఎగిరి అపాయంలో వెళ్ళకుండా కాలుకి తాడుకట్టి
సాయంత్రం షికారు తీసుకెళ్ళారు.

# ఆగస్టు 15

పొద్దున్నే అతని కబోర్డు తలుపు నాన్న తీస్తూ
అతను యెగిరి పళ్ళు తోముకుంటున్న షా తలమీద
ప్రతిరోజూ పచారు చెయ్యడం ఆతనికిష్టం. షా లోపలి
తో వుంటే తలమీద నుంచి మామిడిచెట్టు మీదికి యెగి
ఎంతసేపైనా లోపలికి రాలేదు. పకపక పిలిచింది
రాలేదు. అతని కఠినత్వం చూసి పకపక నొచ్చు
గంట గడిచింది. మళ్ళీ పకపకపిలిచింది. వొసారి వచ్చే
అతను వాళ్ళ పిలుపు వింటాడో, లేదో అతని Instinc
యమై వెళ్ళిపోతాడో యింకా తెలీదు. ఆగస్టు 15
పండక్కి పందిరి వేయించాలి పందిరి వేస్తే
వెళ్ళిపోతాడేమోనని పందిరి వెయ్యడానికి వీల్లేదం
అమ్మ.

పకపక పుత్తరం రాస్తోవుంటే కలాన్నిలాగేసి
కాయితాన్ని కోపంగా పొడిచి, కాయితంమీద రెట్ట వే
మధ్యాహ్నం పకపక నిద్రపోతో వుంటే, చుట్టూ
కాళ్ళూ, చేతులు మెల్లిగా పొడిచి, మొహం దగ్గర
బతిమాలి లేపుతాడు తనకి ఆకలైనప్పుడు.





# పిచిక ప్రేయసి



కబోర్డునించి వొదలగానే బైటికి యెగిరాడు. వెళ్ళి
పోయేట్టు ఏమను కున్నాడో ఏమో వెంటనే వెనక్కి
వొచ్చారు. కాసేపు వుండి, యింటి ముందున్న శిరీషం
మీదికి యెగిరాడు. ఎంత పిలిచినా రాలేదు. పక్కయింటి
చెట్టుమీదికి వెళ్ళి అక్కడి పక్షులతో కలిసి వెళ్ళిపోయినాడు.
మధ్యాహ్నం కనపడి పకపక పిలిస్తే వచ్చేశాడు.

ఎందుకో, ఎప్పుడూ మాటిమాటికీ ముక్కుని కత్తికి
పదును పెట్టినట్టు దేనికో వొదానికి రాసి శుభ్రం చేసుకుంటో
వుంటాడు.

రెట్టలు యెక్కువగా వేస్తున్నాడు ఎక్కడ పడితే
అక్కడ. అతనికి వెళ్ళిపోవాలనే ఆవేదన ఎక్కువగా పని
చేస్తోంది. కాని ప్రేమవల్ల వాళ్ళని వదలలేకండా వున్నాడు.
ముఖ్యం పకపకని.

అద్దందగ్గర పిచికదగ్గిరికి యెక్కడనించో ఒక ఆడ
పిచిక వొచ్చింది. ఒచ్చి అద్దంముందు అతని పక్కనే తనూ
కూచుంటోంది. తన అందమే చూచుకుని దినమంతా మురిసి
పోయే మొగ అతనికి ఈమె తనతో భాగస్వామి కావడం
ఏమాత్రం యిష్టం లేనట్టుంది. పొమ్మని తరిమేశాడు కాని
వచ్చిన ఆమె స్త్రీ. పురుష రక్షణ, ప్రేమా జీవితానికి అతి

అవసరమైన జీవి! పైగా ఈ యిల్లూ, సులభ
అన్నిగంటలూ తన అందాన్ని తాను చూసుకో
అద్దంలో పురుషుడికి చూపడమూ అంతకన్న పిచ్చి
ఆలోచించుకోగలదా ఏ పిచికమ్మ ఐనా! ఎంత
లక, కాళ్ళావేళ్ళాపడింది. యింక గతిలేక వొప్పు
అతనికి యేమేమి చెప్పి వొప్పించిందో-జీవితమంతా
సేవలో గడుపుతాననీ, ఇంకెవరి వంకా కన్నెత్తి
తోడునీడనై వుంటాననీ. ఈ వాక్యాలన్నీ పెళ్ళి మంత్రా
వుండనే వున్నాయి. మనుషుల్లో కాని తరువాత జీవిత

సాయంత్రం మామిడిచెట్టు మీద కూచున్నాడు
గాడు. షికారు వేళకి అందరూ బైటికి రాగానే
మీద వాలాడు. అతన్ని కూడా షికారు తీసుకు పో
కాలుకి చైన్ కట్టబోతే రోషపడి, బాధగా అరిచాడు.
అతన్ని ఏవిధంగానూ యిరికించకూడదని తెలిసింది.
షికారులోనైనా అపాయాలు వొస్తే రానీ, అతని స్వే
చ్ఛాన్ని ఏ మాత్రమూ అరికట్టకూడదనుకున్నారు
కట్టకుండా నీ యిష్టమని వొదిలేశారు. అతను వెళ్ళి
చెట్టుమీద కూచ్చున్నాడు. డేగలు, గద్దల నించి
అపాయం రాకండా జగన్నాథం కాపలి వున్నాడు.
అవుతోంటే అమ్మ అతన్ని రమ్మని పిలిచింది, ఒచ్చే



# రేడియోతో గొంతు కలిపి



పొద్దున్న వొదలగానే బుజ్జిగాడు వెళ్ళి మామిడిచెట్టు మీద కూచున్నాడు. ఆకలి వేసినప్పుడు వొచ్చి రొట్టెతిని వెళ్ళి చెట్టుమీద కూచుంటాడు. ఇతన్ని చూసి కాకులు తరుము తున్నాయి. తరిమినప్పుడు వచ్చి ఇంట్లో దూరతాడు. కాకులు కొంచెం తప్పుకోగానే వెళ్ళి చెట్టుమీద కూచుంటాడు. మధ్య మధ్య రేడియో వింటాడు బయట గోడమీదకి యెగిరికూచుని వినిపించే రేడియో వింటాడు. ఆ పాటతో గొంతుకలిపి కూ కిచకిచమని పాడతాడు. అతనికి తెలుసు తక్కినపిట్టల వల్లే స్వతంత్రంగా బతికే శక్తి తనకి లేదనీ, కాకులూ, గద్దలూ తరుముతాయని, అందుకనే వెళ్ళిపోకండా ఈ మనుషులతో వుంటున్నాడని అనుకున్నారు. అతనిపైన చాలా ప్రేమ కొందరికి, కాని తమ ప్రేమా, తమ భయాలు అతనికి ఆటంకం కాకూడదని అతని స్వేచ్ఛకి అతన్ని వొదిలేశారు, అతను లేకపోతే ఏమీ తోచని పకపక కూడ చూస్తో పూరుకుంది.

ఇంట్లో వున్నప్పుడు ప్రతివాళ్ళ భుజాలపైనా, తలల పైనా, యెక్కి కూచుంటాడు చాలాసేపు. నెత్తిమీద రెట్టలు వేస్తాడు. ఇంట్లోవాళ్ళు గుర్తు. కొత్తవాళ్ళు వొస్తే వాళ్ళవేపు పోడు.

అద్దం దగ్గిర మొగపిచిక బుజ్జిగాడి దగ్గరిగా వొచ్చింది స్నేహం చేసుకోడానికి. కాని యితను ఏమీ చోటివ్వలేదు.

స్నేహానికి, చాలా తక్కువ వాళ్ళని చూసినట్టు చూ యరగా మొహం తిప్పేసుకుని దూరంగా వెళ్ళాడు. ఆ పిచిక Disappoint అయి వెళ్ళిపోయింది.

ఇవాళ మధ్యాహ్నం యితను మామిడి చెట్టు కూచునివుండగా, ఓ పెద్ద గోరింక వొచ్చి దూరంగా ఇతన్ని చూసి యేమేమిటో మాట్లాడింది. ఇతనేం పలకలేదు. మెల్లిగా కొమ్మనించి కొమ్మకి దూకుతో బుజ్జిగాడి దగ్గరికి వొచ్చింది. బుజ్జిగాడు దడుసుకున్నట్టూ, ఇష్టం లేనట్టూ యెగిరివచ్చి వరండాలో చదువుకుంటున్న షా భుజం మీద వాలాడు. ఆ పక్షి మాత్రం వొంటేటే పిలుస్తోంది కూరాకు మీదనించి. ఇతను చాలా సేపు షా భుజంమీదనుంచి కదలకుండా అంటో జవాబు చెపుతోనే వున్నాడు. కాని ఆ పక్షి వున్నంత సేపూ మళ్ళీ చెట్టుమీదకి వెళ్ళలేదు.

నర్తకి చదల్ని నేలమీద పడేసి తినమంటే మానేశాడు. కుర్చీ పీటమీదవేస్తే తానూ కుర్చీపీట మీదకి యెగిరి కూచుని తింటున్నాడు. అతనికి అభిమానం నేలమీద తినడం, అతని అలవాట్లలో మంచి ఆత్మాభిమానం కనబడుతూ వున్నాయి. తిండి మానుకుంటాడు కాని తక్కువ తనానికి వొచ్చి లోకువకాడు.

స్వేచ్ఛాప్రియుడు

ఆగష్టు 6

నిన్నరాత్రి వర్షం పడ్డది. పొద్దున్నే వెళ్ళి యింటిపైన వున్నాడు. వర్షానికి వుసుళ్ళు బయలుదేరాయి యింటి మీదకు. నర్తకి, జగన్నాధం, కురంగేశ్వర్, అరుషులతో కలిసి వుసుళ్ళు పడుతున్నారు. పెద్ద పండగలాగుంది. పట్టిన వుసుళ్ళని అతనికి కప్పుపైకి అందించటం అతను వాటిని కిందికి మెడవొంచి తినడం. కాని వాళ్ళు దగ్గిరిగా వస్తే మాత్రం దూరంగా పోతాడు. వీళ్ళేదో తన నౌకర్ల లాగు భావించి వాళ్ళుపెట్టింది తింటున్నట్టూ వుంది వాలకం. చూస్తే విసిగి వుసుళ్ళని బక్కెట్టులో పోగుచేసి రోజంతా అతనికి తినపెట్టారు

మళ్ళీ యివాళ మధ్యాహ్నం అతను శిరీషం చెట్టుమీద కూచునివుంటే రెండు పిట్టలు వచ్చాయి. అతనితో మాట్లాడాయి, పాడాయి. అవి దగ్గిరిగా వస్తే యితను కదలక అక్కడే కూచున్నాడు. చాలా ప్రేమగా మాట్లాడాయి కొంత సేపటికి బుజ్జిగాడు లోపలికి వచ్చేడు. వాళ్ళిద్దరూ బుజ్జిగాడి తల్లిదండ్రులు అంది షా. వాళ్ళు యిన్నాళ్ళకి గుర్తుపట్టి తమతో రమ్మని పిలవటానికి వచ్చారుట కాని తద్దుడిలాగు యితను రానని చెప్పి పంపినట్టున్నాడు.

అందరూ భయపడ్డారు బుజ్జిగాడు తల్లి దం
వెళ్ళిపోతాడని. అమ్మమాత్రం "ఆ గోరింకల్ని వెళ్ళ
ఇన్నాళ్ళు యెక్కడ వున్నారు వీళ్ళు? అంత ప్రేమగ
తమ బిడ్డని కాకుల్నించి రక్షించుకోలేక పో
ఇన్నాళ్ళూ కష్టపడి తిండిపెట్టి వాణ్ణి పెంచి పె
చేసిందెవరు? ఈనాడు కనపడ్డాడా?"అంటో కేకలు పె
ఇతనిపైన అమ్మకి బాగా మమకారం.

సాయంత్రం షికారుకి బైలుదేరుతున్నారు. మా
ప్రకారం బుజ్జిగాడు వచ్చి షా భుజంమీద వాలాడు.
"కాలుకి తాడుకట్టి తీసుకు వెళ్ళండి" అంది. ఆ మా
మామిడి చెట్టుమీదకి యెగిరి పోయినాడు. ఈ మా
మనుషుల మాటలు అతనికి చాల అర్థమౌతాయి.
వాళ్ళ మాటలేవో, తెలుగుభాష మాత్రమేనేమో.
వాళ్ళ మాటలూ, భాషలూ అర్థమౌతాయో లేదో తెల

అసలు మనుషుల భాష అర్థమౌతుందా!
యేవన్నా ముఖభావం వల్లోగాని, కంఠధ్వని వల్లగాని
యింకేదన్నా మనుషులకి అర్థంకాని స్పందనాల Vibra
వల్లగాని తెలుసుకుంటాయా మృగాలూ, పక్షులూ. కాని
లకీ, కుక్కలకీ భాషే అర్థమయేట్టుంది. తెలుగుకి అలవా
జంతువులు అరవాన్ని, ఇంగ్లీషుని అర్థం చేసుకో
బుజ్జిగాడి కోసం పిలిచి పిలిచి అతను రాడని షికారు



యినారు. షికారు నించి వొచ్చాక అడిగితే బుజ్జిగాడు
ంకా రాలేదని చెప్పింది పకపక. అప్పటిదాక "క్లుక్,క్లుక్"
జవాబు యిస్తోనే వున్నాడట. చీకటైనాక యింక పలక
ఆ రాత్రి మళ్ళీ సమావేశమైనారు. భోజనమైనాక
నముందు, బుజ్జిగాడు యింటికి రాకండా ఎందుకు వుండి
యినాడని సమస్య. బహుశా కబోర్డులో అతనికి వుక్క
స్తుంది గావును! అతన్ని గదిలోనే స్వేచ్ఛగా వొదలా
కే పిల్లిభయం. కిటికీలన్నీ మూస్తే ఆ గదిలో నిద్ర
యే అమ్మకి వుక్క బుజ్జిగాడికి వుక్క. అందుకని అతనికి
లో యెత్తుగా ఓ Perch తయారు చెయ్యాలని నిశ్చ
ంచారు.

పొద్దున్న అతనికోసం వెతకడం ప్రారంభించారు.
అందరూ బైలుదేరి చెట్లమీద, తోటల్లో, అడవిలో పల్లాకు
లో అతన్ని "బుజ్జిగాడూ"అని పిలుస్తో వెతుకుతున్నారు.
లేదు. విసుగెత్తి, అలిసి, నిరాశపడి వూరుకున్నారు.

ఎనిమిది గంటలకి యింటి ముందరి శిరీషం చెట్టుమీద
కూ, కూ, అన్నాడు. అతని అరుపు తక్కిన గోరిం
అరుపులనించి ప్రత్యేకం. ఆ అరుపుని యింట్లోవాళ్ళు
ంగా గుర్తుబట్టగలరు. పకపక వెళ్ళి పిలిచింది. వొక్క
ంటలో వచ్చి పకపక భుజంమీద వాలాడు. ఇంటికి వొచ్చి
పకపక తనని రాత్రంతా వొదిలినట్టు పకశే సాధింపు.
అతను సరాసరి ఇంట్లోకిరాడు. చెట్టుపైని కూచుని పిలుస్తాడు.

ఇల్లు గుర్తువుండదా మనుషులేగాని! లేక బెట్టుచేస్తా తీసుకు పోతేగాని రాకూడదని?

నేను రాత్రంతా వెళ్ళిపోయినానని వీళ్ళ వచ్చిందేమో! నన్ను తీసుకుంటారో లేదో! చెట్టుమీద పిలిచిచూద్దాం. తీసుకుంటే సరేసరి వాళ్ళు పళ్ళ ఎగిరిపోదాం అనుకుంటాడా?

ఏమైనా అతనిలో ఓ సందేహంగాని, భయ కనపడదు. తప్పు చేసిన కుక్కలో కనపడ్డట్టు. పి కూడా ఆత్మనిశ్చయం కనపరుస్తాడు. వీళ్ళకి అక్క పోతాను అన్న నిబ్బరం నించి తొణకడు.

జగన్నాధం Perch తయారుచేసి గది కప్పు కట్టారుకాని యెంత చెల్లించినా, బతిమాలినా దానిమీద లేదు.

అతనెప్పుడూ అంతే. ఏదన్నా అతనికి Suggest ఒప్పుకోవాలో లేదో నిర్ణయించుకుంటాడు. ఇష్టమైతే వంతం లేకండా వెంటనే వొప్పుకుంటాడు. ఇష్ట యేమైనాసరే లొంగడు. వాళ్ళూ అతనికి యిష్టం లేని అతన్ని బలవంతం చెయ్యరు.

ఇవాళ్ళ మధ్యాహ్నం తల్లీ దండ్రీ వచ్చినట్టు కాని బుజ్జిగాడు ఆ చాయలకు పోలేదు. ఇంట్లోనే వున్నా నిరాశపడి వాళ్ళు వెళ్ళిపోయినారు. తిరిగి రాలేదు.



## బుజ్జి భూపాలుడు

సాయంత్రం బుజ్జిగాడు యెంత పిలిచినా చెట్టుమీద నించి దిగిరాలేదు. అందరూ షికారుపోయి ఓచోట కూచు న్నారు. బుజ్జిగాడు వెంటలేక వాళ్ళకేం తోచటంలేదు. బుజ్జి గాడు పోకిళ్ళు అన్నీ తలుచుకుంటూ కూచున్నారు. బుజ్జి గాడు నర్తకిచేతా కురంగేశ్వర్‌చేతా జగన్నాధంచేతా చాకిరీ చాగా చేయించుకుంటాడు. కాని నర్తకి దగ్గిరికి తప్ప తక్కిన వాళ్ళ దగ్గరికి పోడు. వాళ్ళు ముద్దుగా పిలిస్తే రాడు. వాళ్ళు దగ్గిరిగా వెడితే గర్వంగా దూరంగా పోతాడు. పైగా అతనికి అన్నీ రాజసాలూ, రాజరీవి. అతనికి బుజ్జిభూపాలుడు అనేపేరే పెట్టి తాము అతనికి సేవకుల మన్నారు వాళ్ళి ద్దరూ. తక్కినవారు అతని మంత్రులూ, సచివులూ, పకపక అతని తల్లి.

ఆగష్టు 8

బుజ్జిగాడు బైటికి వెళ్ళినప్పుడల్లాన్నీ కాకులు తరుము తున్నాయి. చాలాకాలం యింట్లోనే గడుపుతున్నాడు. అతను కొంచెం దూరంగా యెగిరినా సహించలేదు అమ్మ. అద్దం దగ్గిర పిచికలతో చేరతానని యింకో మొగ పిచిక వచ్చింది. రెండు మొగ పిచికలూ కలియపడ్డాయి. కొత్తదాన్ని తరిమే

సింది మొదటి పిచిక. ఆ యుద్ధంలో గాయాలై
వొళ్ళంతా రక్తమయం.

బుజ్జిగాడి చిన్నెలు వన్నెలు వృథాపోతున్నా
కురంగేశ్వర్ ఒక కెమేరా తెప్పించాడు. బుజ్జి
మామూలు గోరింకల్లోలేని తెలివి, ఏదో రీవి, ప్రేమ
నవి యెన్నో ప్రత్యేకమైన గొప్ప తనాలు కనిపిస్తా

## రీవిగా స్టౌ మీద

బుజ్జిగాడికి స్టౌ మీద కూచోవడం బాగా
టయింది. కూర చేస్తున్నా చూసుకోక స్టౌమీద
మీదికి దూకాడు. కాళ్ళు కాలాయి. చాలా గోల
బాధతో. భయపడి స్టౌని భోజనాల ఇంట్లోంచి
మార్చారు.

## రేడియో శ్రోత

అగ

పందిరి వేశారు. బుజ్జిగాడు ఏమీ కొత్తపడ
పందిరి వెయ్యడంచేత కాకులవల్ల అపాయం తగ్గింది.
ఆ కాకులు బుజ్జిగాడికోసం చుట్టుపక్కల చెట్లపైన కాచు
కూచుంటున్నాయి. ఇన్ని కాకుల్ని అక్కడ యెప్పు



లేదు. వాటికి వేరే పనీలేదు. అట్లా కూచుని బుజ్జిగాణ్ణి
ప్పు వక్కసారిగా మీదపడతాయి. ఎందుకో వాటికా
! బుజ్జిగాడు వెళ్ళిపోకుండా వుండేట్టు కాకుల్ని కావలి
లేమో ఈశ్వరుడు అనుకున్నాడు నాన్న.

బుజ్జిగాడు యెప్పుడూ యింట్లోనే వుంటున్నాడు.
డియో వినడమూ, వేళకి తిండి తినడం, నెత్తులమీదా,
లమీద సవార్లు చెయ్యడం. నర్తకి వెతికి అతనికి చదలు
కనిపిస్తోనే వుంది. జగన్నాధం, కురంగ్ చదల సప్లయిలో
నిమగ్నులయే వున్నారు. సాయంత్రాలు షికార్లకి అతను
కాశం లేదు. బుజ్జిగాడికి కురంగేశ్వర్ ఫోటోలు
తీస్తున్నాడు.

## షా కుర్చీ వెనక

అగస్టు 10

కాకులకి దడిసి పొద్దున్నంతా యింట్లోనే వుంటాడు.
రేడియో దగ్గిర రేడియో వింటో. ప్రతిరోజూ 12 గంటలప్పుడు
కాకులు సద్దుమణిగాయనుకుని బైటికి పోతాడు. కాకులు
కాచుకునే వుంటాయి. ఆకుల్లోంచి వొక్కసారిగా బైటికివచ్చి
అతనిమీద పడతాయి. ఆ వేళకి షా వరండాలో చదువు
కుంటో వుంటుంది. బుజ్జిగాడు యెగిరి వొచ్చి షా కుర్చీ వీపు
మీద కూచుని వాటిపంక చూస్తాడు. అతని వాలకంచూస్తే

"ఇప్పుడేం చేస్తారు?" అని కాకుల్ని వెక్కిరిస్తు
వుంటుంది. అసలు కాకులు తన కోసం కాచుకుని
యని ముందు తెలిసే సిద్ధమై వాటిని యేడిపించటాని
తున్నాడా? కుర్చీ వెనక గంటలకొద్దీ షా వెళ్ళే
కలలుకంటో కూచునే వుంటాడు. అప్పుడప్పుడు తనలో
పాడుకుంటో, అప్పుడతని స్తిమితంచూస్తే నాన్నకి
వుంది.

భోజనాలప్పుడు రెండు పూట్లా తలుపు రెక్క
కూచుని భోజనాలు చూస్తోవుంటాడు. వుండుండి
డప్పుడు యేవో Remarks చేస్తో.

# పలాయనం

అగస్ట్

సాయింత్రం, అతను యెగిరి బైటికి వెళ్ళేము
రొట్టెతిని పోతాడు. చీకటి పడుతోందనగానే తిరిగి వస్తా
పొట్టనిండా పెడితే వెళ్ళి తిరిగి రాడనీ; సగం ఆకలి
వుంటే రాత్రి పడుకోబోయేముందు తిండికోసం తిరిగి
డనీ చెప్పింది షా. పకపక ఆ మాటలు మరిచిపోయి
సాయంత్రం అతనికి పొట్టనిండా తిండి పెట్టింది. అ
ఎగిరిపోయి తిరిగి రాలేదు.



సాయంత్రం మంచి అందమైన సూర్యాస్తమయం. ఆ రంగుల్ని చూసి నిలవలేక వెళ్ళిపోయినాడని సూర్యాస్తమయాన్ని సాధిస్తోంది అమ్మ. ఈ సూర్యాస్తమయాలకి అన్ని రంగులెందుకే ఎరుపూ, పసుపూ, తెలుపూ, లేకపోతేనేం? అంటోంది.

రాత్రి చాలాసేపు చూశారు, పిలిచారు. అసలు వెళ్ళిపోయినాడనీ, ఇంక రాడనీ బెంగ. తలిదండ్రులు తీసుకువెళ్ళిపోయినారని అమ్మ.

అతనులేక రాత్రి యిల్లు చిన్నబోయింది. అందరికీ బెంగగా వుంది. అమ్మ గోలకి అంతులేదు. రాత్రి ఏ చెట్టు మీదో పడుకుంటే పాములు తినేస్తాయనీ, గుడ్లగూబలు కరుస్తాయని, చీమలు కుడతాయనీ దిగులు. తిరిగి రావాలనుకుంటే అతనికి చీకటి అడ్డమేమోననీ రాత్రి పదిగంటలదాకా యింటి డాబామీద ఆకాశదీపం వేయించి వుంచింది. రాత్రి చీకటికి భయపడి తనని తలచుకుని బెంగపడతాడు అంటోంది అమ్మ.

"నీకు వేళకు రొట్టె యెవరందిస్తారు అడవిలో! ఇప్పటల్లానేలే. రేపు చలీ, వానా వొస్తే తెలుస్తుంది" అంటోంది.

# కామెడీ ఆఫ్ ఎర్రర్స్

బుజ్జిగాడు పొద్దున్నే వొచ్చేశాడు ప్రతిరోజూ గ అతన్ని తరుముతోనే వున్నాయి. బైటికి పోవడం, వొచ్చి దాక్కోడం, తొంగి చూడడం, మళ్ళీ వెళ్ళడం పని. పకపకని తప్ప యింకెవరినీ తన వొంటిమీద వెయ్యనీడు.

షా చదువుతో వుంటే మధ్యాహ్నాలు ప్రతి మామూలుగా కుర్చీ వీపుమీద కూచుంటున్నాడు. మధ్యాహ్నం ఓ గంట షా నర్తకికి Shakespeare నాటకా చదివి వినిపిస్తో వుంటుంది. షా పైకి నాటకాన్ని చదువు సేపూ బుజ్జిగాడుకూడా షా కంఠం వెంబడి తనూ కుక్ అంటోనే వుంటాడు. బైటికి చదవనప్పుడు చదువు షా మొహంలోకి కుర్చీ వెనకనించి వొంగి చూస్తా ఇప్పుడు చదువుతున్న Comedy of errors ని అతనూ Enjoy చేస్తున్నాడు. ఒకవేళ అతను యెక్కడన్నా తున్నా, షా బైటికి చదవడం ప్రారంభించగానే వొచ్చి మీద వాలతాడు.

ఆగష్టు 1

మధ్యాహ్నం కుర్చీమీద కూచునేవాడు. ఇప్పు షా భుజంమీదే వుంటాడు. ఎప్పుడన్నా షా పాడితే





ం కలిపి పాడతాడు. పకపక అన్నం వారుస్తోవుంటే పైన వాల్తాడు వొచ్చి. వేడిగంజిలో పడతాడని డుం.

## యమనేది తెలీదు!

ఆగష్టు 14

రేపు పండగ, అందరూ వొస్తారు. వాళ్ళని చూసి బుజ్జిగాడు పారిపోతాడని వొకటే భయం అమ్మకి.

ప్రతిరోజూ పొద్దున్న భోజనాల తరవాత నాన్నకి, ర్తకికి విభూది వేస్తుంది షా. బుజ్జిగాడుకూడా వొచ్చి నోరు రిచి అడిగి తనకి విభూది వేయించుకుంటున్నాడు.

లక్కితనతో ఆడుకుంటాడు గనక కుక్కల భయం దు బుజ్జిగాడికి. ఇవాళ లక్కి స్నేహితుడు ఒక కుక్క గుమ్మం లోపలికి వచ్చింది. ఆ కుక్క యింట్లో అలవాటైతే ప్పుడో వొకప్పుడు బుజ్జిగాణ్ణి పట్టుకుంటుందని ఆ కుక్కని టికి పంపి తలుపు వెయ్యాలని పకపక వెళ్ళింది. పకపక వెంట బుజ్జిగాడు వెళ్ళాడు నేలమీద గెంతుకుంటో! పోతున్న కుక్క బుజ్జిగాణ్ణిచూసి, అతన్ని పట్టుకోవాలని వెనక్కి తిరిగింది. ఆ కుక్క కోసం లక్కి పరిగెత్తుకుంటో వొచ్చాడు. కుక్కలిద్దరూ వొకరిపైన వొకరు పడి తమ మిత్రత్వాల్ని తెలుపుకుంటున్నారు. వాటి మధ్య బుజ్జిగాడు యిటూ, అటూ గంతులేస్తున్నాడు.

కొత్త కుక్క దృష్టి బుజ్జిగాడి మీద వుంది. గెంతుళ్ళని భయంలేకుండా తమాషాలాగు చూస్తు బుజ్జిగాడు. పకపక అరుస్తో బుజ్జిగాణ్ణి అక్క బొమ్మంతే పోడు. అతనికి భయమనేది తెలీదు. చూస్తున్న షౌ బుజ్జిగాణ్ణి పిలిచింది. అతను ఎగిరి కొమ్మమీద కూచున్నాడు. గోల అంతా సద్దుకున్న "చచ్చేవాడివిరా, వెధవా!" అని పకపక బుజ్జిగాణ్ణి పకపకనించి కోపం యెరగడు. అతను తెల్లమొహం కుని యిదేమిటి? అని చూస్తున్నాడు.

## సామాన్యమైన పిట్టకాదు

ఆగష్ట

పండగ యివాళ, చాలామంది వొచ్చారు. బుజ్జిగా ఏం భయంలేదు. పైగా Self coucious అయినాడు. పకపక వెనుక ఠీవిగా నడుస్తున్నాడు. ఎగిరి వొచ్చి మధ్యా నడిచాడు. ఆ కొత్తవాళ్ళ మొహాలు చూస్తో. చూచి అందరికీ ఆశ్చర్యమే.

రాత్రి భజనకి ముందూ తరవాతా బుజ్జిగాడిని గేశ్వర్ ఫోటోలు తీశాడు.





పగటి భోజనాలప్పుడు యిదివరకు తలుపు రెక్కమీద కుని చూస్తోవుండేవాడు. అప్పుడు కిందికి దిగి కంచాల నుంచుని అందరూ తినేవి యెట్లా వుంటాయో తనూ చూస్తున్నాడు. కంచంనుంచి కంచానికి నడుస్తాడు. ఏ కంచంలో యేముందో చూసుకుంటో అంతసేపూ మనుషుల మొహాలకేసి చూస్తో ఏదో మాట్లాడుతోనే వుంటాడు.

పళ్ళెంలో నీళ్ళు పెడితే రోజూ మధ్యాన్నం వెళ్ళి ఆ పళ్ళెంలోదిగి, రెక్కలు తడుపుకుని స్నానం చేస్తాడు చాలా సేపు. కాకుల భయం పట్టుకున్నప్పటినుంచి స్నానానికివెళ్ళే ప్పుడు పకపక యెక్కడవుంటే అక్కడికి వెళ్ళి బట్టలు పట్టుకులాగి తనతో రమ్మంటాడు తన రక్షణకి. స్నానం చేస్తో వుండగా శత్రువులని కాచుకోలేడు గావును! స్నానం చేశాక తడిసి యెగరలేడు. అందుకని తన రెక్కలార్చుకున్న దాకా పకపకని కదలనీడు. పకపక లోపలికి పోతోవుంటే అరుస్తాడు.

బుజ్జిగాడికి పకపక కనపళ్ళేదు యివాళ మధ్యాన్నం. పక్క గదిలో వుంది. అతను యిటూ అటూ వెతుకు తున్నాడు. అది అర్థం చేసుకుని "పకపక ఆ గదిలోవుంది వెళ్ళు" అంటే కుక్ కుక్ అని గెంతుతో పక్కగదిలో దగ్గిరికి వెళ్ళాడు. ఇది అంతా చూస్తున్న శ్రీహరి "ఇది సామాన్య మైనపిట్ట కాదండోయ్!" అంటో విస్తుపోయింది.

# దోసెల పిండిలో

గలగల మనడం కుక్ కుక్ మనడం కొత్త కొ
నేర్చు కుంటున్నాడు. పెద్ద గోరింకల మల్లే కూస్తున్నా

నర్తకి తన గదిలో వుంటే డాబామీద పొగగూ
నర్తకిని పిలుస్తాడు. అక్కడినించి తొంగిచూస్తో పా

తనకి బైటికి వెళ్ళి కూచోవాలనిపిస్తే తనని గ
తరమకుండా నర్తకినన్నా, పకపకనన్నా వెంటే
పోతున్నాడు.

ఆగష్టు

బుజ్జిగాడి కోసం పెట్టిన స్నానాల పళ్ళెంలోకి
పిట్టలుకూడా వచ్చి స్నానాలు చేస్తున్నాయి.

ఇవాళ వంటింట్లో దోసెల పిండిలో దూకాడు
తెల్లటి పిండితో బంక అయినాడు.

పొద్దున్నప్పుడు వంటింటి పొగ గూట్లోంచి వం
వున్న పకపకని పిలిచి మాట్లాడతాడు. ఆ చిల్లుల్లోంచి
వంగుతాడు ఆ పొగలోనే. ఆ చిల్లుల్లోంచి కింద
తున్న పులుసులోనో, పప్పులోనో పడతాడని,
అమ్మకి.



# ...గోర్, షేక్స్పియర్,

...షా, అశా

ఆగష్టు 19

మధ్యాన్నం షా చదువుతోవుంటే ప్రతి రోజూ కుర్చీ
...కూచుని దగ్గరగా పైకి చదవమని అడిగి చదివించు
...రు. అరుస్తాడు ఇటూఅటూదూకుతాడు చదివిందాకా.
... చదవడం ప్రారంభిస్తే వూరుకుంటాడు. అతని భాషా
...లూ, వాటి అర్థాలూ వాళ్ళకి తెలుస్తున్నాయి. యిప్పుడు
...ష్టంగా, అదీగాక తన యిష్టాల్ని వాళ్ళకి తెలిపే ప్రజ్ఞ
...ంది, అతనిలో. పశుపక్ష్యాదులపైన ప్రేమ వుండేవారికి
...డుతుంది వాటిలో తెలివి. అడివి పిట్టలనుకునే వాటి
...హృదయంలో కూడా యెంత ప్రేమవుందో, ఎన్ని యిష్టాలు
...ంటాయో తెలుస్తుంది. ఇవాళ షా చేతులో Reader's digest
...ంది. అతను వచ్చి చదవమని అడగగానే దాంట్లోంచి బిగ్గి
...గా చదివింది. అతను ఆ పుస్తకం యిష్టపడలేదు. అయి
...ంగా అరిచాడు. కోపంగా పుస్తకాన్ని ముక్కుతో పొడి
...డు. పుస్తకాన్ని లాగెయ్యాలని ప్రయత్నించాడు. ఆ భాష
...టువుగా వినపడ్డదిగావును! Amercian Propaganda ఇష్టం
...దేమో! తెలుగులో రాసిన మీరాబాయి అనే పుస్తకం తీసి
...క్తి కదా అని చదివితే ఆ పుస్తకాన్నీ పొడిచాడు యిష్టం
...దని. ఆ ఆంధ్రుడెవరో పిట్టకికూడా అయిష్టమయేటంత

అసహనంగా రాశాడు ఆ పుస్తకాన్ని. అప్పుడు షా గీ
తీసి చదివితే ఒప్పుకున్నాడు. తనూ ఆ మాటల్ని
లని ప్రయత్నించాడు. షా కంఠంతో కలిపి అలాగే
తున్నాడు అంతసేపూ. ఎంతసేపు చదివినా యింకా
మంటాడు. తనకి వేళ ఐపోయి షా వెళ్ళింది.
విక్క మొహం వేసుకుని అట్లాగే కుర్చీ వీపుమీద
వుంటే నాన్నకి జాలివేసి తను వెళ్ళి కూచుని గీతా
చదివాడు. మళ్ళీ అంత శ్రద్ధగాను విని, అంతసేపు
మాట్లాడుతున్నాడు బుజ్జిగాడు.

హిందీభాష యిష్టంలేదు బుజ్జిగాడికి.

మనుష్యుల్లో యిష్టాయిష్టాలు యెట్లా వుంటాయో
వరకు విశదం చెయ్యాలని చూస్తాయి మనోశాస్త్రాలు.
అంతా తెలుసునని కొందరు శాస్త్రకారులు, ప్రగల్భం
పండితులు ఒప్పుకుంటారు. తమకి తెలిసింది స్వల్ప
మరి ఈ పక్షులకి, మృగాలకి యెట్లా యేర్పడ్డాయి.
రుచులు? దూడ బుజ్జాయికి సంగీతజ్ఞాన మెవరిచ్చా
పశు పక్షుల అభిరుచులు కళలో వుండే అసలు
వ్యక్తం చేస్తున్నాయా? బుజ్జిగాడికి షేక్స్పియరు
టాగూరున్నూ యిష్టంకావడం చూస్తే నాన్న దృష్టిలో
గొప్పవనుకునే గ్రంథాలు అతనికీ యిష్టమైనాయి.
అభిరుచులు అతనికి పట్టాయేమో. ఎట్లాగోపోనీ అనుకు



సంగీతంలో Cheap cinema music ఆషా, లతా అతనికి
నాన్నకి యిష్టం. నాన్నకి యిష్టంలేదు, కాని వాళ్ళ
లోని మాధుర్యం అతనికి Appeal అయిందేమో! ఆ
వినడంవల్ల వాళ్ళ కంఠాల అందాన్ని తాను చూడ
పోతున్నాడేమో అని ఆలోచించాడు నాన్న. ఇవన్నీ
యిష్టాయిష్టాలా?

## ఉదయ విహారి — ఆగష్టు 20

పొద్దున్న లేవగానే యెగిరిపోయినాడు బుజ్జిగాడు.
ఇంట్లోనే వుంటున్నాడే పొద్దున్నే యెగిరిపోయినాడు.
కాదనుకుని అమ్మ పనులు మానేసి చెట్లవెంట, పుట్ల
అడవిలో, పల్లాకుత్తులో వెతుకుతోంది. ఎంతకీ కన
దు. విసిగి వూరుకుంది. మధ్యాన్న మెప్పుడో వచ్చాడు.

ప్రతిరోజు మధ్యాహ్నం షేక్స్పియరు వింటున్నాడు
ప్రత్యేకంగా వచ్చికూచుని షేక్స్పియరు చదవడం ప్రారం
వగానే యెక్కడవున్నా, ఏ పనిమీదవున్నా యెగిరి
స్తాడు. ఆఖరయిందాకా కదలడు.

## చినుకులు ఇష్టంలేక — ఆగష్టు 21

పొద్దున్నే మబ్బువేసి చినుకులు. బైటికి వెళ్ళాలని
చూసి, చినుకులు యిష్టంలేక ఇంట్లోనే వుండిపోయినాడు.

ఎప్పుడన్నా ఓ సాయంత్రం, రాత్రి చె
పొలనుకుంటాడు. వెడతాడు. మబ్బుగా వుంటే వా
దని ముందే తెలుస్తుందో, యేమో తిరిగి వ
చినుకుల్ని చూసి చాలా సంతోషంతో పాడుతో
వేస్తాడు. కాని బైటికి చినుకుల్లోకి పోడు. చినుకుల్లో
పోవాలని ఏ పిట్టలకీ వుండదనీ, ఆకలివల్ల వాటికి బై
తప్పదనీ చెప్పింది షా.

## బక్క శత్రువు

ఆగ

బుజ్జిగాడి రక్షణకోసం ఏ కుక్కల్నీ కాంపౌ
రాకుండా తరిమేస్తున్నారు. ఓ బక్క కుక్క కాంపౌ
తలివేపు కావలివేసింది, బుజ్జిగాణ్ణి తినాలని. బుజ్జిగాడు
గోడయెక్కి కూచుంటాడు తన విలాసార్థం. పురుగుల
యెప్పుడన్నా గోడకిందికి ఆవతలవేపు దిగుతో
ఎప్పుడు దిగుతాడా పట్టుకోవాలని కాపలా వేసింది

## గోడ మీద

ఆగ

ఇవాళ గోడెక్కి కూచుని కిందికి దిగాలని
చూశాడు. ఆ బక్క కుక్క కనపడ్డది. గోడ దిగడు.
వేపు తొంగిచూస్తో ఒకటే అరుస్తున్నాడు, మధ్యమధ్య



వాళ్ళవంక చూస్తో. అటు ఏముందా అని వెళ్ళి చూస్తే
బక్క కుక్క కనపడ్డది. వెళ్ళి ఆ కుక్కను వెళ్ళగొట్టారు.
గాడు గోడదిగి, పురుగులు యేరుకున్నాడు.

## టార్చిలైట్

ఆగష్టు 24

రాత్రి కరెంట్ పోయింది. సాయంత్రం నించీ దీపాలు
లాంతరు వెలుతురులో రొట్టె మామూలుగా పెడితే
జ్జిగాడు తినలేదు. ఏం తోచలేదు, ఏంచెయ్యాలో, ఎందుకు
నం లేదో తెలీదు. కొంతసేపటికి అర్థమై Tarch light
స్తే రొట్టె తిన్నాడు లైట్లు లేనంతసేపూ యేమీ మాట్లాడ
కా ముడుచుకు కూచున్నాడు.

ఇంట్లో బాగా ముఖ్యమౌతున్నాడు. అతని సంగతులే
ట్లాడుకోడం అందరూ.

## ద్రౌపతి మల్లే

ఆగష్టు 25

చిన్నరావుగారు యిక్కడ వుంటున్నారు. బుజ్జిగాడు
మొగవాడా, ఆడదా అని ప్రశ్నించారు. తెలుసుకోడం
యెట్లాగో తెలీదు. తెలుసుకోవలసిన పనీ రాలేదు. ఆయనకి
పిట్టలూ, వాటి వేటా, వాటి విరోధులూ, డేగలూ డేగల

భయమూ యివన్నీ చాలా తెలుసు. ఎన్నో కబు
విషయమై చెపుతో: పిట్ట మొగదో ఆడదో తెలు
యెట్లాగో చెప్పారు. ఆ పరీక్ష చెయ్యాలని కురంగే
వెళ్ళి బుజ్జిగాణ్ణి చదలు పెడతానని మోసంచేసి పట్టు
తీవ్రంగా, మామూలుగా పట్టుకుంటే అంత గోల చే
అతనికి వీళ్ళు మాట్లాడుకుంటున్న మాటలు అర్థమ
అనిపించింది. అదీగాక ఆ మోసాన్ని కూడా
చేస్తున్నాడతను అనిపించింది. అతన్ని వెంటనే వొ
కురంగేశ్వర్రావు. వొదలగానే పకపక మీద వాలి
సేపు తనకి జరిగిన అవమానం సంగతి చెప్పుకుని
ద్రౌపది మల్లే.

# డాబాపైన

ఆగస్టు

డాబాపైన పందిరివంటి పాక వుంది. అక్కడ
ధాన్యంలో కూచుంటుంది. వాళ్ళలోకొందరు చుట్టూ
టాడు. వాళ్ళకి యేమన్నా ధ్యాసం అబ్బుతుందేమో
బుజ్జిగాడు రోజూ పైకి వాళ్ళ దగ్గరికి వెడతాడు.
వంటింటి పొగగూటి దగ్గిరికి వెళ్ళి అమ్మతో,
పొగ గూట్లోంచి మాట్లాడి తరవాత డాబాపైన
వాళ్ళ దగ్గిరికి వెడతాడు.



అది చాలా అందమైన స్థలం. చుట్టూ మెరిసే యెండ.
గారి కూర్చునించి, యెదురుగా అరుణాచలం, దక్షిణాన
కాంపౌన్డు తోట, తురాయిపూలు వొకవేపు. పక్కగా
కొమ్మలుపడుతో శిరీషవృక్షం యెర్రటి పూలతో-
కొండల్లో అంతమయ్యే దీర్ఘమైన మైదానం ఇవన్నీ
తో వుంటాయి.

అతను షా ముందు వాలతాడు. అటూయిటూ యెగురు
వాళ్ళు అట్లా కదలక, తనని పలకరించక కూచోడం
మొదట్లో వాళ్ళ బట్టల్ని పట్టి పీకేవాడు. వాళ్ళ
మృదువుగా కొడిచి పలకరించేవాడు. తరవాత
అర్థమయిందో అలవాటయిందో లేక వీళ్ళకన్న
అతనికే ధ్యాసమబ్బిందో తనూ నెమ్మదిగా షా
కూచుంటాడు. విసుగెత్తితే పందిరి వెదురుపైన
అకాశమూ, చెట్లూ చూస్తో వుంటాడు
సేపు. ఎప్పుడన్నా పాడతాడు. అటు యెగిరి
పిట్టల్ని పలకరిస్తాడు. దిగివొచ్చి పందిరి
తో ఆడుకుంటాడు. ఒక పక్షికూడా పాకలో కూచున్న
కలవడం సమావేశానికి అందాన్నిచ్చింది. అతనూ
ఓ మనిషే వాళ్ళ పనుల్లోనూ, శాంతిలోనూ,
లోనూ.

# రెట్ట భయం

ఇప్పుడతనికి కొంచెం కాకుల భయం తగ్గింది… పొద్దున్న బోసు కాంపౌన్డులో చెట్లమీదికి యెగిరాడు. … అకస్మాత్తుగా ఓ డేగ తరిమింది. వరండాలోని … అరిచారు. ఒక్కరవ్వలో చావు తప్పించుకుని వొచ్చి … మధ్యా పడ్డాడు.

అతను పొద్దున్న భోజనాల దగ్గిర తలుపు … నించి కిందికి వాలి, కంచాలలో దిగి వంటని పరీక్షచే…న్నాడు.

కంచాలలో రెట్ట వేస్తాడని భయం.

# బూడ్సులు

ఇవాళ కంచాలలోకి బాగా యెగబడి షికార్లు చేశా… అన్నంమీద, కూరలమీద కాళ్ళుపెట్టి తిరిగాడు. అతను… డెక్కడో పెంటలమీద అంతా తిరుగుతాడని అమ్మ … తోసెయ్యమంటుంది. ఆ పనివాళ్ళ చేతకావటంలేదు. అతని… బూడ్సులు చేయించాలని కురంగేశ్వర్, యింట్లోకి రాగా… కాళ్ళు కడగాలని జగన్నాథం.





# …పకతో మారాం

ప్రతి మధ్యాన్నమూ పకపక ఆశ్రమానికి వెడుతుంది. …గంటలప్పుడు యితను యిదివరకు పకపకకోసం …నేవాడు. ఇప్పుడు వెళ్ళే సమయం తెలిసింది. ఆ … తాను కాచుకుని వుండి, వెళ్ళవద్దని మారాం పెడుతు… పకపకవెంటతానూ బయలుదేరి గోడ మీద కూచునీ … పక్కన చెట్టుమీదికి యెగిరీ, కోపంగా, బాధగా అరు… బుజంమీదికి యెగిరి కూచుని, మొహంలోకి చూస్తో, …వద్దని బతిమాలతాడు. కాళ్ళకి అడ్డం పడతాడు.

ఆ సమయానికి పకపక ముందే జాగ్రత్తపడి యెవరి…న్నా బజ్జిగాణ్ణి లోపలికి తీసుకుని వెళ్ళమని, తాను వెళ్ళి…తుంది. ఆ సంగతి కనిపెట్టి యెవరు తనని మరపించాలని …సినా, తాను బైటపడి పకపకవెంట బైలు దేరుతున్నాడు. …ని ఆశ్రమానికి తీసుకువెళ్ళమన్నాడు ఓ రోజు నాన్న. … పకపక బుజంమీద కూచుని సరిగా వెళ్ళడు చెట్లమీదకి …గురుతాడు. ఆ చెట్లమీద యెగురుతో వెళ్ళి యెక్కడన్నా …ప్పోతాడని పకపక భయం.

మధ్యాన్నాలు షా చదివినంత సేపూ కుర్చీమీద …మ్ముని షా వెళ్ళి పోగానే నాన్నా, నర్తకీ, పకపక వుండే …లోకి చేరుకుంటాడు. పకపకని నిద్రపోనీడు. తననిచూడ

కండా నిద్రపోవడం అతను సహించడు. చాలాసే
మీదా, గూట్లో కూచుని వొళతే పాడడమూ, రెక్కలు
డమూ, యిదేపని సాయింత్రం దాకా.

## ఉత్తరంపై ఆగ్రహం

అగష్టు

పొద్దున్న భోజనం అయాక నాన్న ఆ రోజు పోస్టులో
వచ్చిన వుత్తరాల్ని షాకి చదివి వినిపిస్తాడు. అప్పుడే అందరూ
విభూది వేయించుకుంటారు. భోజనం దగ్గిర అందరి
ల్లోనూ విహరించి, బుజ్జిగాడు తనూ తేచి బైటికి వరండా
వస్తాడు. అందరితో పాటు తనూ విభూది వేయించుకుని
తరువాత పక్కనవున్న ప్రహరీ గోడమీదికి యెగిరి కూ
టాడు వాళ్ళని చూస్తో. ఇవాళ వుత్తరాలు చదివేప్పుడు
సేపు గోడమీద కూచునే వున్నాడు. అప్పుడప్పుడు కీక్కీ
మని రిమార్కులు చేస్తో, ఈమధ్య గోడమీద నుంచి
వచ్చి తనూ వాళ్ళమధ్య కూచుంటున్నాడు. వుత్తరాలు
సంతసేపూ, ఆ వుత్తరాల భాష అతనికి అర్థం కా
ప్రారంభించిందేమో మరి! కురంగేశ్వరరావు దగ్గి
వచ్చిన వుత్తరం చదువుతో వుంటే శ్రద్ధగా విన్నాడు.
అంగీకారాన్ని తెలియచేస్తో. శ్రీనివాసన్ అనేకొత్త
రాసిన వుత్తరం చదువుతో వుంటే నాన్ననీ. ఆ వుత్తరా





...గా పొడవడం ప్రారంభించాడు. నాన్న ఆ సంగతి గమ
...క యింకా చదువుతో వుంటే, వుగ్రుడై నోరు తెరచు
... కరవడాని కొచ్చాడు. పోనీలే అని యింకా చదువుతో
...కే గట్టిగా నాన్నని కొరకడం ప్రారంభించాడు చాలా
...టో. ఉత్తరం చదవడం ఆపేయాల్సి వచ్చింది. ఆ
...త్తరం తీసి చదువుతో వుంటే వూరుకున్నాడు. ఎందుకట్లా
...ది ఆశ్చర్యం!

(1) ఆ శ్రీనివాస్ మంచివాడు కాదా? అతని సంగతి
బుజ్జిగాడికేం తెలుసు? ఎట్లా తెలుసు? ఆ వుత్తరంలోని
...రాం స్పందనవల్ల కనిపెట్టగలిగాడేమో! పిట్టలు ఏదో
...రంగా తెలుసుకోగలవేమో! లేక బుజ్జిగాడికి ఆ శక్తి
...దో!

(2) తన సంగతి శ్రీనివాస్ ఏమీ రాయలేదనా?

(3) శ్రీనివాస్ వుత్తర మప్పుడు కోపంరావడం
...త్త Accident అయివుంటుందా? అందరి ధ్యాసనీ తన
...ంచి Divert చేస్తున్నాడనా? అట్లా ఐతే కురంగేశ్వరరావు
వుత్తరం పైన యెందుకు కోపం చూపలేదు?

అందరి శ్రద్ధా తననించి ఆ వుత్తరం పైకి పోయిం
...ని కోపం రావడం కూడా విశేషమే కదా! నాన్నమీద
కోపం రావొచ్చు. కాని ఆ వుత్తరం కాయితంవల్ల ఏదో
జరుగుతుందని దాన్ని పొడవడం? ఒకసారికాదు. చదవడం
ఆపిందాకా పొడుస్తూనే వున్నాడు. ఇంకో వుత్తరాన్ని

పొడవడు ఓ కాయితంవల్ల అందరూ తనని ఉపేక్ష చేస్తా-
రని తెలుసుకుని ఆ కాయితంపైన కోపంచూపి ...
యత్నించి చదివేవాణ్ని కరవడం?

కురంగేశ్వర్ వుత్తరంపైని యిష్టం శ్రీనివాస్ ...
రంపైన కోపం. తక్కిన వుత్తరాలకి వుపేక్ష, చిత్రం! ...
వుత్తరంలో బుజ్జిగాడు అంటో చాలాసార్లు రాశారు ...
కురంగేశ్వర్ వుత్తరంచూసి యిష్టపడ్డాడా? తన పేరు ...
లేదని శ్రీనివాస్ వుత్తరంపైన కోపమా?

## చెట్టుమీద గోరింక

ఆగష్టు ...

ఎక్కడినించి యెవరు "బుజ్జిగాడూ" అని పిలి...
బదులు పలుకుతాడు క్లుక్ అంటో.

ఇవాళ సాయింత్రం పకపక షికారు బైలుదేర...
బుజ్జిగాడికి యిప్పుడు షికార్లు యిష్టంలేవు. పకపక బై...
దేరిందని యివాళ పకపకతో బైలుదేరాడు. కాని ...
ప్రక్క చెట్టుమీద యెక్కి అగిపోయినాడు. రాత్రి ...
వుండగా అందరూ తిరిగి వొచ్చినప్పుడు ఆ కొమ్మమీద ...
పక కోసం యెదురుచూస్తో కూచుని పలకరించాడు. ...
గంటలూ అక్కడే కూచుని వుండటం ఆశ్చర్యంకదూ!



...తెలుగుదేశం వెళ్ళిన కురంగ్ రాస్తున్నారు. తోవ
...ఘుతానూ, ఆ వూళ్ళల్లోనూ తనదృష్టి అంతా గోరింకల
...నే, ఆ దేశపు గోరింకలకీ, ఈ దేశపు గోరింకలకి పోలిక
... అవి నల్లగా, ముద్దల్లాగు, మొద్దులాగు వుంటాయని,
...కనపడదని రాశాడు. ఈ దేశపు గోరింకల్లో కూడా
...గారు ప్రత్యేకం, అతని వాలకమే, అతని ముఖం తీరే

## ...రల పరీక్ష

సెప్టెంబరు 1

...హద్దున్నీ షా భోజనాల యింట్లో కూరలు తరుగు
... ప్రతి రోజూ కూరల దగ్గిర వాలడం ప్రారంభించాడు.
... మేం వొండుకోబోతున్నారు అన్నట్టు ఓ కూర జంగిడీ
... యింకోదాని దగ్గిరికి తిరుగుతాడు పరీక్షగా చూస్తో.

కాకులు యితన్ని తరమడం మానేశాయి. పెద్దవాడై
...నో, లేక వాటికి విసుకు పుట్టిందో! బుజ్జిగాడు మాత్రం
...ల్ని యేడిపించడం మానలేదు. పని లేకుండానే కాకుల
...క్కి యెగురుతాడు. అవి తరమడానికి లేస్తో వుండగానే
... వరండాలో కుర్చీమీద కూచుంటాడు రెట్టలు వేస్తో.
...ల్నిచూసి నవ్వుతో వుంటాడా? అతని కుక్ కుక్ శబ్దా
...లో కాకుల్ని యెక్కిరింపు మాటలుంటాయా? కాకులకి
...ట్టి మంది వరండాలోకి వస్తాయి తరుముకుంటో. బాగా

రానిచ్చి చల్లగా ఆ వరండాలో యెవరు వుంటే వా
రిగా పోతాడు. కాకులకి చాలా వొళ్ళుమండి
కాని ఏం చేస్తాయి? ఈ మధ్య యితన్ని పసిగట్టి
ఓ గద్ద తిరుగుతోంది యింటిదగ్గిర. మొదట్లో గద్ద
శంలో చూడగానే యితన్ని దాచేశారు. తరువాత
దాక్కుంటున్నాడు. ఈ పక్షులకి మనుషులకు లేని
్రియాలు వుంటాయేమో! ఎక్కడో ఆకాశంలో
వలయాలు కొడుతోఉంటే యింట్లో యితనికి తెలు
ఈ కాకులూ, గద్దలూ మామూలు గోరింకల్ని ఏం చే
అంత దూరంనించే తెలుసుకుంది గద్ద. యిక్కడ
షులు పెంచే గోరింక వుందనీ, దానికింకా పూర్తి
బలం రాలేదని.

మెల్లిగా బుజ్జిగాడికి ధైర్యం యెక్కువయింది.
వచ్చిందని తెలీగానే వెళ్ళి ఏ పొగగూటిలోనో, చూరు
కూచుని తలమూపి కుక్ మంటాడు. గద్ద విసురుగా
మీదకి రాగానే చల్లగా మెడని గూట్లోకి లాక్కుంటా
గద్ద విసురుగా వెళ్ళిపోతుంది. బుజ్జిగాడు నవ్వుకుంటా
గద్ద తిడుతోందా? బెదిరిస్తోందా? రోజూ యిట్లా
యేడిపిస్తున్నాడు ఆ గద్దని.

చూస్తోవుంటే ఈ పక్షుల్లో యేవో కట్టుబాట్లు
ధర్మాలూ కనపడతాయి. అవి వొకరు పెట్టినవీ లేక
ఆలోచించి పెట్టుకున్నవీ కావు. వాటి స్వభావా





న్నాయి. లేక వాటి శరీరాల్లోనే యేర్పడ్డాయి. నాలుగు
కులు కలిసి వంతరిగ చెట్లకొమ్మల మీద కూచుని ఏ చిన్న
పిన్నా పొడిచి చంపి తినెయ్యగలవు. కాని ఆ పిట్టపక్కనే
మంటాయి కాకులు. దాని జోలికిపోవు. దెబ్బతిన్న వాటి
టికి, మనుషులు పెంచే వాటి జోలికీ వెడతాయి. సృష్టి
కార్థం ఈశ్వరుడు పెట్టిన నియమమూలేమో? పశు పక్షులు
నియమాన్ని అతిక్రమించవు. మనిషికూడా తన క్రోధాన్ని
ఆలోచనలోకి దింపుకోకపోతే ఈ సహజ నియమాల
నే పరిపాలింపబడేవాడు. తన ఆహారానికి తప్ప ఏ జంతు
వా యింకో జంతువుని చంపుతుందా?

## ఆశ్రమంలో మెంబరు

సెప్టెంబరు 2

అందరూ మాట్లాడుకుంటో వుంటేమాటల్లో బుజ్జిగాడు
హా కలుస్తాడు. ప్రతివారిమాట చివరా తనూ ఏదో ఒకటి
టున్నాడు.

ఇంట్లో ప్రతివారితో, ప్రతివారి Activity తో తనూ
చుకుంటాడు. అందరికీ మాటల్లో, పనుల్లో, ఆలోచనల్లో
తనూ ఈ ఆశ్రమంలో ఒక మెంబరు అయినాడు.

మధ్యాహ్నాలు నాన్న పడుకుని చదువుకుంటోవుంటే
పక్కనే తనూ కూచుంటాడు. రాసుకుంటో వుంటే బల్లమీద

వాలి, ఏం రాస్తున్నాడో పరీక్షిస్తాడు. అంతసేపు
రెట్టలు.

# ఎంత త్యాగమో!

పకపక తన సొంత విచారంలో వుంటుంది.
ఆ సంగతి కనిపెట్టి, పకపకని విడవక యెప్పుడూ
వుంటున్నాడు. ఎన్నో ఆటలాడుతాడు.
అరుస్తాడు. గోలచేస్తాడు. తను లేకపోతే పకపకకి
రన్నట్టు మరీ అంటిపెట్టుకుని వుంటున్నాడు.

సాయంత్రం వెళ్ళిపోయి, తిరిగి రాలేదు.
అందరూ గోల పడ్డారు. రాత్రులు వుక్కగా వుంటున్నా
ఆ కబ్బర్డులో మరీ వుక్క. అందుకని రాత్రులు
గడపాలనుకున్నాడో యేమో!

చెట్టుమీద చల్లనిగాలి, పైన నక్షత్రాలు, చిన్న
శబ్దాలు, ఆ చెట్టు గాలిలో వూపు. ఓ జీవించి వున్న
పైన, తనూ భాగమై వుండడం. అనాదిగా వొస్తున్న
వృక్ష సంబంధం ఇవన్నీ మానుకుని చీకట్లో,
బంధింపబడడానికి ప్రతి సాయంత్రం తిరిగి వొస్తున్నా
అతనిది యెంత త్యాగమో ప్రేమతై! మానవుడా



అంటావు. ప్రేమ కావ్యాలు రాస్తావు. కావ్యాలేగాని
ప్రేమ అంటే తెలుసునా కవీ !

# రాకూడదని బెట్టా?



పొద్దున్నే వెతికారు. తలో దిక్కుకిపోయి "బుజ్జిగాడా,
బుజ్జిగాడా!" అని అరుస్తూ. ఎక్కడాలేడు. పొద్దెక్కుతోంది
లేదు, అతన్ని రాత్రి యేదన్నా తినేసిందా? అని అను
మానం. ఏ పామో, గుడ్లగూబో పట్టుకుందని, బతికివుంటే
రాడా? అతని ప్రేమ చూస్తే, వాళ్ళతో అతని అలవాట్లు
చూస్తే, అతను కావలసి వాళ్ళని వొదిలి పోడని నమ్మకం.
వాళ్ళలో ఒక మనిషి బుజ్జిగాడు. చెప్పకుండా పోతాడా?

పనిపిల్ల, సరస పల్లాకుత్తునించి వొస్తోవుంటే, సరసని
చూసి అరిచాట్ట. అతని ఆకారాన్ని సులభంగా గుర్తిం
చింది సరస కూడా! పల్లాకుత్తులో యెన్ని గోరింకల అరు
పులో! కాని బుజ్జిగాడి కంఠాన్ని సరసకూడా గుర్తించింది.
సరస గంతులేస్తో వొచ్చి చెప్పింది. పకపక వెళ్ళి పిలిస్తే
వొచ్చి భుజంమీద వాలాడు.

రాత్రి పల్లాకుత్తులోనే పడుకున్నాడా! మరి తెల్ల
వారగానే యింటికి యెందుకు రాలేదు. సరసకి కనపడ్డ
దాకా యెందుకు అక్కడే కూచున్నాడు? మృగాల

పక్షుల నడవడి చూస్తే చాలాసార్లు యిట్టానే
రేపుతుంది. ఎంతో తెలివిగల మృగాలూ, గుర్రాలు,
చాలాసార్లు ఏమీ తెలియని వాటిమల్లే ప్రవర్తిస్తాయి.
వొచ్చి పిలిస్తేనేగాని రాకూడదని ఎట్లా బుజ్జిగాడికి
అంతదూరాన పల్లాకుత్తులో కూచోడమెందుకు? ఇంటి
డ మరిచిపోయి సరసని చూడగానే జ్ఞాపకం వొ
చాడా? లేక యెప్పుడో మధ్యాహ్నం యింటికి చేరుకో
సరసని జూసి పోనీ యిప్పుడే పోదాం అనుకున్నా
పల్లాకుత్తునించి యింటికి వచ్చే మార్గం చెరిగిపోయి
పక్షులు తమ గమ్యస్థానం తెలుసుకోవడం చూపుల్ల
మనిషికి తెలియని స్పందనాలు యేవో వుంటాయి
అవి చెరిగిపోతే వాటికి దోవ తెలియకపోవచ్చు.
రుతువులు ప్రకారం వలసపోయే (మైగ్రేట్ అయి)
వేలకొలది మైళ్ళు వాటి గమ్యస్థానానికి ఎగిరివే
లేని సముద్రాలు దాటి వెడతాయి. వాటి తోవని
కనుక్కుంటాయో యెవరికి తెలీదు. పక్షులకి
వాటి జాతినిపట్టి వుంటాయి. అభివృద్ధి చెందుతాయి.
రాలకున్నతోవ తెలుసుకునే విజ్ఞానంఅంత గొప్పగా
లకిలేదేమో! మనుషుల్లో పెరిగినబుజ్జిగాడిలో పూర్తిగా
చలేదేమో! రాత్రి దూరంగా ఎక్కడికోపోయి పడుకుని
రాపటానికి పల్లాకుత్తు దాకానే దోవ కనుక్కున్నా
తరువాత తెలీలేదా ?





చూస్తే

పైన ఆకాశంలో డేగ తిరుగుతోంది. బుజ్జిగాడు
వెళ్ళబోతూ ఎట్లా కనిపెట్టాడో కనిపెట్టాడు. వెంటనే
వొచ్చి తలుపు మీద వొణుకుతో కుంగిపోయి,
ముడుకుని కూచున్నాడు. పలకరిస్తే పలకడు. ఆ డేగకి
క్కడ వున్న సంగతి తెలిసి పోయిందేమో నన్నట్టు
వణించి, గద్దలనించి పరుగెత్తుతాడు. కాని ఒక్క డేగని
మాత్రం భయంతో ఒణుకుతాడు.



ష్టి రహస్యం ?

నర్తకి రోజూ చదల్ని బుజ్జిగాడికి పెడుతోనే వుంది.
బట్టలూ అవీ రాత్రులు చదలకి ఆహారంగా పెట్టి అవి
గానే వాటిని బుజ్జిగాడికి ఆహారంగా వేస్తోంది.

"ఒక్క ప్రాణికోసం ఇన్ని ప్రాణులు" అన్న కర
యి మాటలు జ్ఞాపకం ఒస్తాయి. కాని సృష్టి అంతే.
ప్రాణికోసం ఎన్నో ప్రాణులు. ఆ విషయం తర్కించి
ప్రయోజనం లేదు.

అమాయకంగా తిండికోసం చేరే చదల్ని చూస్తే
కళ్ళు కరుక్కుపోతుంది! ఆ బుజ్జిగాడికోసం యింత హత్యా
పిస్తుంది! భూత దయాపరులు బుజ్జిగాణ్ని తరిమెయ్య
ంటారు. చదల హత్య పాపమంటారు.

పట్టనీ, చక్కెరకి చీమలు పట్టనీ, చివరికి యింట్లో ... చేరనీ, వాటిని వేలకొలది నాశనం చెయ్యడానికి ... చమూ వుండదు. ఒక్కరి ప్రాణం కోసం యెన్ని ... చంపవచ్చు. పిట్టకోసం చంపకూడదు. నాన్న రాస్తు... వుంటే మధ్యాహ్నాలు వచ్చి పుస్తకం పక్కన కూచుం... బుజ్జగాడు. రాస్తున్న కలాన్ని ఆపాలని చూస్తాడు, ... వకశే పొడుస్తాడు ముక్కుతో.

రాత్రి పది గంటలప్పుడు బుజ్జిగాడు పంజరంలో ... కుంటున్నాడు. వెళ్ళి చూస్తే చీమలు, అతని రెక్కలో ... దేనికో చీమలు పోగవుతున్నాయి. అమ్మ చీమల్ని ... పడుకోబెట్టింది. ఈ చీమల్లో, వుక్కలో, వాళ్ళకోసం రాత్రి ... తిరిగివచ్చి కబ్బర్డులో పడుకుంటున్నాడు బుజ్జిగాడు.

## గీతాంజలి

సెప్టెంబ...

ఇవాళ పొద్దున్నే కూరల తనిఖీకి వొచ్చాడు బుజ్జిగా... తను తెలుగు చేసిన గీతాంజలి గీతాన్ని షాకి వినిపిస్తున్నా... నాన్న. అందరి Attention తీసుకుంటున్నాడనో, ... బుజ్జిగాడు నాన్నని కొరకడానికి వొచ్చాడు. ... "గీతాంజలికి యిదా తెలుగు?" ఏం బాగాలేదని Pro... చూపడానికి వొచ్చాడో. బుజ్జిగాడి సారస్వత అభిరుచి... అభిప్రాయాలపై గౌరవం నాన్నకి. నాన్న చదవడం ... శాడు. బుజ్జిగాడు వెళ్ళి నాన్న తలపైన కిటికీ రెక్కపై...



... చదవడం ప్రారంభించాడు. ఈసారి గీతాంజలి ...లో పడి, తెలుగునీ, ఇంగ్లీషునీ కూడా విని ... పాడడం ప్రారంభించాడు. మొదట్లో చదివిన ...లుగు బాగాలేదేమో? రాత్రులు కబ్బర్డులో వుక్కగా ... రాత్రులు వెళ్ళిపోతున్నాడని, నివారణో ...లక్కించుకున్నారు. ఒకరు యెలెక్ట్రికల్ పంఖా, ... కబ్బర్డుని రాత్రులు వరండాలో పెట్టాలనీ యిట్లా ...చ్చారు. చివరికి ఓ పేళ్ళ పంజరం తయారుచెయ్యా... పంజరంలో యితన్ని పెట్టి చెట్టుకి వేళ్ళాడకట్టాలనీ ...చారు కాని వాన వొస్తేనో! అందుకని వరండాలో ...కట్టాలనుకున్నారు.

## ...పాట

సెప్టెంబరు 8

...గాడు ఈ రోజు మరీ పెంకితనం చేశాడు. పక ... పైకి పోనీటం లేదు. కదిలిదంటే బిగ్గరగా ..., తలుపు రెక్కమీద కూచుని, తొంగిచూస్తో అడ్డ... చేస్తున్నాడు. పకపక కదిలిందంటే కాళ్ళకి ...తో యెంతో బాధగా అరుస్తాడు.

రాత్రులు అమ్మ తోడువుంటేనేకాని పడుకోడు. అమ్మ ...మీద పడుకుంటే లోపలికి రమ్మని పిలుస్తాడు అమ్మ "... హరిహరి గోపాల హరిహరి" అని జోలపాట

పాడాలి. వుక్కగా వుందని అతనికి రోజూ ... మేలుకుని కూచుని, అతన్ని పడుకోపెట్టడం ఒక ... తంతు అయింది. భోజనాల గది మూసేముందు ... నికి రొట్టె తినిపిస్తుంది. అతన్ని పకపక తన చేత్తో ... కుని తీసుకుపోతేనేగాని అతను తన పడక గదిలో ... అంతవరకూ దీపాలు వెలుగుతూనే వుండాలి. ... వీల్లేదు. ఎవరన్నా వరండాలో మాట్లాడుతున్నప్పుడే ... వచ్చి "మాట్లాడకండి" అని ఆపేస్తుంది. "... బుద్ధిలేదేం?" అన్నట్టు కోప్పడుతుంది.

## పకపక మీద భక్తి

బుజ్జిగాడు ఈమధ్య ఆటలు ప్రారంభించా... యెండు తాటాకు ముక్కనితెచ్చి పకపక పాదాల ... "నేనిస్తున్న ఈ కాన్కని తీసుకో" అన్నట్లు ... చూశాడు. "ఈ ఆకు నాకెందుకురా" అని పకపక ... సింది. మళ్ళీ ఆ ఆకుముక్కని భద్రంగా ముక్కుతో ... కునితెచ్చి, తీసుకోమని అతి భక్తితో చేతి కందిస్తూ ... నాడు. ఆ ఆకుని యింకెవ్వరడిగినా యివ్వడు. ... వూరుకోడు. పొడవ వస్తాడు.

మధ్యాన్నాలు నర్తకితో యుద్ధాలు చేస్తాడు. ... వొస్తువు అని ఓకాయితం ముక్కనో దేన్నో పెట్టుకుని ... నర్తకి చూసేట్టుగా తనతో ఆడుకోమని అడుగు...



...తో, గంతులతో, నర్తకి ఆ కాయితం ముక్కని తాకి ... బుజ్జిగాడు అడ్డం వొస్తాడు. యుద్ధం! గంతులేస్తాడు. ... కాయితం ముక్కని దూరంగా లాగేస్తాడు. దాచు ... వేలుని కరవ వొస్తాడు. పెద్దగా నోరుతెరిచి ... చూస్తాడు. నర్తకి వూరుకుంటే "ఆడవేం?" అన్నట్లు ...లోకి చూసి కవ్విస్తాడు. పకపకతో యిట్లాంటి ... ఆటలు ఆడడు. ఆ కాయితం ముక్కని నాన్న ...తో కరవవొచ్చాడు. పకపక తాకితే భక్తితో కళ్ళు ... వాల్చి కదల్లేదు.

...క్కన గోరింకలు యిట్లాంటి ఆటలు ఆడతాయా? ...లో వాటి పిల్లలు ఒకదాంతో ఒకటి ఆడుకుంటాయా? ... ఆహారం సంపాయించుకునే దేవుళ్ళాటతో వ్యవధి ...? మనుషులతో- ముఖ్యం ప్రేమించే మనుషులతో ... మనుషుల ఆటలు యిట్లాంటివి చూసి అలవాటవు ...! కాని యెవరూ అతనితోకాని యింకెవరితోకాని ...ంటి ఆటలు ఆడలేదే, అతను ఆడిందాకా?

చిన్నగా సన్నగా వుంటున్నాడు బుజ్జిగాడు, బలవ ...లేదు. సహజమైన ఆహారం లేకనా? చెట్లపైన యెండలో ...కం లేకనా? కాని సంతోషంగా వున్నాడు. చిక్కి ...న్నారని షా అతనికి రోజూ ఓ బొట్టు Shark liver oil ...స్తుంది!

# హిందీ భాషా ద్వేషా?

బుజ్జిగాడు పంచపాత్రలోంచి తప్ప
గిన్నెలతోపడితే అటునించి వెళ్ళిపోతాడు.
కోసం ఓ యెర్రని Plastic టంబ్లరు తీసుకొస్తే
కొట్టాడు. తనని అవమానం చేసినట్టు! వాళ్ళ
లోనే తనూ తాగాలి.

మధ్యాహ్నం షా Chinese Literature
చదువుతోంది. అది Communistic propaganda
బుజ్జిగాడు మామూలు ప్రకారం యెగిరివొచ్చి,
కూచుని షాని బిగ్గిరిగా చదవమని అడిగాడు. షా
విని, యింక చదవొద్దని కోపంతో అరిచాడు. షా
ఆ పుస్తకాన్ని ముక్కుతో పొడిచాడు. ఓ పేజీని
చింపడానికి సిద్ధమైనాడు. షా నవ్వి, ఆ పుస్తకాన్ని
పెట్టి కబీరు గీతాల్ని ఇంగ్లీషుని టాగూరు రాసిన
వినిపించింది. దానికీ అతను యిష్టపడక అరిచాడు.
లోని కబీర్ గీతాలలో కవిత్వం తక్కువ. ఆ
బుజ్జిగాడికి నచ్చలేదా? షేక్స్పియర్ చదివితే
న్నాడు. Reader's Digest చదివినా యిష్టంలేదు.
Literature యిష్టంలేదు, ఎందువల్ల? వాటిల్లో
Propaganda లేదు. కథలూ, వ్యాసాలే. అతనికి
విరోధమైనాయి? ఆ పిట్ట రూపంలో ఏదోగొప్ప
ఆత్మ నివసిస్తోందా? ఆ భాషా, దాంట్లో
వుండే Propaganda అతనికి తెలిశాయా?



గొప్ప భాషా జ్ఞానం, పాండిత్యం అతని జ్ఞానంలో
వుందా? లేక ఆ భాష స్పందనాలు అతనికి బాధ
యా? అట్లానే హిందీని భరించలేదు. ఆ భాష
పఠించదా, లేక ఏ జన్మలోనో హిందీ భాషా ద్వేషా?
ఏ హిందీ మనిషినో ద్వేషించాడా? ఆ మూలంగా
భాషని ద్వేషించి, ఆ ద్వేషాన్ని ఈ జన్మకి తెచ్చు
దా? ఆ అనంగీకారం Accident అనుకుంటే హిందీలో
చదవనీ, ఎప్పుడు చదవనీ అతను తిరగపడతాడు.

ఒక్క మనిషికి తప్ప పశు పక్ష్యాదులకి తెలివిలేదనీ,
ఏం చేసినా అది Instinct అనీ మానసిక శాస్త్రజ్ఞులు
యించారు. ఎన్ని అద్భుతాలు చూసినా వాటిని గమ
తమ థియరీలు మార్చుకోవలసి వొస్తుందనిగావును.
అర్థం కావు. వాటిని తమ థియరీలతో సరిపుచ్చలేరు.
అవుల్ని చూస్తున్నారు, ఈ ఇంట్లోవారు. వాటిలో
తెలివో! ఈ బుజ్జిగాడిలో మనుషులకు లేని ఎన్ని
అభిరుచులో! సంగీతంలో సారస్వతంలో! ఇవన్నీ
ఏనా! వీటి తెలివి మానవుడి తెలివిరకం కాదు గనక
స్పష్టం కాదు గనుక. మానవుడి తెలివి (Develop )
అయినట్లు అన్ని ముఖాలా Develop కాలేదు గనక,
తెలివి చాలా స్వల్పమని నిర్ణయించారు.

అనాదిగా వొస్తున్న అలవాట్లని ఈ పశువులూ పిట్టలూ
హృదుని అభివృద్ధి చెందలేదు. కనక "ఇన్స్టింక్టే" గాని

“ఇంటెలిజన్స్” లేదని శాస్త్రజ్ఞుల వాదన. వెయ్యి స
రాల కిందట ఎట్లా గూళ్ళు కట్టుకుంటున్నాయో
ఈనాడూ అట్లానే కట్టుకుంటున్నాయి. గూళ్ళ పరిపా
అవి అట్లాగే తంటాలు పడతాయిగాని, తెలివిగా
మార్చుకోవు. ఈ నాటికీ ఆ గింజల్నే తింటున్నాయి
మనిషికి మల్లే అవి నాజూకు కాలేదు. అవి చలినీ,
వాననీ భరించగలవు. వాటికి యిల్లు అనీ, ఆస్తి అనీ,
పన్నులనీ ఈ గొడవ లేమీ లేవు. పిల్లలు పెద్దవి గా
గూటిని వొదిలేసి ఎగిరిపోతాయి. “ఇది మనది, ఇం
తీసుకోకూడదు” అనే యేడుపు లేదు. ఈ గడ్డి గూళ్ళు
వాటి అవసరాలకి. వాటి జాతి నశించిపోవచ్చునట గ
యుగాలకి. నశిస్తేనేం? నీ జాతిని చిరకాలం నిలబెట్ట
నువ్వు యేమిటి సాధిస్తున్నావు? నానా రకాల తిన్నా
డంలో నీ అభివృద్ధి నిన్ను రోగాలలోకి దింపింది. పశు
తన్న అధికుడవా నువ్వు మానవుడా? ఎన్ని భయాలు,
ఈర్ష్యలు! పిచిక కోపం క్షణం వుంటుంది. దాని భ
క్షణం, చచ్చే రోజున చస్తుంది ఓ మూల. నీ గతి చూసు
నువ్వు బావురుమని యేడ్వవేం? ఈ జాతులు, సంప్ర
రాలు. Race cultures Nations Economic barriers అంటే
నువ్వు దినదినమూ చస్తున్న చావు. నీకు ఏ మాత్రం
మనిపించని దుర్గతిలో పడి, నీ ఆత్మని చంపే నీ నాగరిక
చూచుకుని గర్వపడుతున్నావా?



స్తారు పుస్తకాల్లో- ఈ పర్వతాలు వుత్త నిరుప
యోగం. ఈ నదివల్ల ఏ ప్రయోజనం లేదు. అంటే కలపా,
! నీళ్ళూ లేవన్నమాట. పక్షులకీ, చేపలకీ, మృగాలకీ,
కి యెంత వుపయోగమో! గడ్డీ, చెట్లూ, చాపలూ,
గా యెంత సంతోషిస్తాయో! మానవుడికి వుపయోగం
కదా ఈ పర్వతమూ, ఈ నదీ అంటే, ఇంకే వుప
యోగం లేదన్నమాటే. నీ పొట్టకీ, నీ సుఖానికీ ఉపయోగ
కి వాటిని అవసరమనుకునే నీ దృష్టి యింత స్వార్థమూ,
సంకుచిత మయింది. తిండికి యెంత తిరిగి పక్షి కొమ్మమీద
లో కూచుని పాడుతుంది. చల్లని గాలి ఈకల్ని రేపి
వుల్లో దూరి కాపలించుకుంటే ‘హా’ అని ముక్కు తెరు
టుంది. తనను మరిచి ప్రేమిస్తుంది. రెక్కలు విదిలించి
స్తమయం వేపు For sheer delight ఎగురుతుంది.

తెల్లారిలేస్తే, ఎట్లా సంపాయిద్దాం ఎట్లా యితరులకి
కుండా నాకే దాచుకుందాం. భూమిలో ఎక్కడ ఏముంది?
గాలినీ, నీళ్ళనీ, ఎండనీ ఎట్లా వుపయోగంలోకి తెచ్చు
కుందాం? ఎట్లా డబ్బుకింద మార్చుకుందాం. ఏ పిట్టల్ని
చంపుదాం, ఏ చేపని తిందాం. Arctic circle లో, సహారా
ఎడారిలో, కాంగో అడవుల్లో చంద్రుడిలో, బుధుడిలో ఏం
రహస్యాలున్నాయో దోచుకుందామనే దృష్టితో తప్ప
సుఖంగా కూచుని తెరిపిగా, ఏ తగాదా లేకుండా అనుభ

వించే శక్తిపోయిందే! పక్షులకన్న పూర్వంగా ప
చెందావా? వాటిది అలవాటా? నీది తెలివా?

## కాలంజారి

సెప్టెంబ

ఎంతెంతో దూరాలు ఎగిరిపోతున్నాడు ప
రొట్టె తిని, అమ్మ ఆదుర్దా పడుతోంది. ఎట్లాగన్నా
వెళ్ళనీకండా చెయ్యాలని.

ఇదివరకంతా అడిగి విభూది వేయించుకునే
వాళ్ళతోపాటు. ఇప్పుడు బరిణలోంచి ముక్కుపెట్టి
కుని తినాలని చూస్తున్నాడు. అభ్యంతరం పెట్టింది
ఆట సాగదని తెలుసుకుని, అడిగి వేయించు కుంటున్నా
పూర్వం మల్లేనే.

ఎక్కడో నూనె గిన్నెలో దిగాడో, లేక
పడ్డాడో, ఒళ్ళంతా జిడ్డు. జిడ్డు. ఆ ఈకెల్ని ఎట్లా
ఎట్లా స్నానం? సబ్బుతో వీలవుతుందా? ఈ సబ్బు
శీకాయలూ అతని చర్మానికి ఈకెలకీ హానిచేస్తాయని
మైన Shampoo కొనాలన్నాడు కురంగేశ్వర్.



## విలువైన కానుక

సెప్టెంబరు 12

సాయంత్రాలు నాన్నావాళ్ళు షికారు వెళ్ళిం తరవాత
డాబాపైన కూచుంటుంది. కొన్నాళ్ళమట్టి బుజ్జిగాడు
డాబామీదికి వెళ్ళి ఎలక్ట్రిక్ తీగెపైన కూచుంటాడు.
తమాషాకి అతన్ని వూపింది పకపక, ఆ రోజునించి
రోజూ తనని వుయ్యాల లూపాలి. సాయంత్రమంతా
చుకుని, వూపించుకుని వెళ్ళి డాబామీద కొమ్మలు
శిరీషంమీదికి ఎగిరి ఓఆకుకోసి పకపకకి కానుకగా
డు. ఎంత జాలి వేస్తుందో! "నాకేముంది నీకు యిచ్చు
కి యింతకన్న!" అన్నట్టుంటుంది. పకపక తానో
కోసి అతనికిస్తే, దానిని పందిరి చూరులో ఓ మూల
తాడు. విలువైనవి దాచుకోడానికి అతనికి యినప
లు లేవు.

ఇవాళ రాత్రి పదిగంటలకి బుజ్జిగాడు కబ్బర్డులో కొట్టు
కుంటున్నాడు. చూస్తే మళ్ళీ చీమలు కబ్బర్డులో. పాపం
అమ్మ గడ్డి, కబ్బర్డూ దులిపి, అతన్ని పడుకోపెట్టింది. ప్రతీ
రాత్రీ అతనికి విసురుతో, జోలపాడుతో పడుకోపెడుతోంది.

# తాంద్ర పాపారాయుడు

సెప్టెంబ

బుజ్జిగాడికి చాలా పొగరెక్కుతోంది. మధ్యాహ్నా
ప్రతిరోజు, నర్తకితో కాయితం ముక్కలకోసం ఆడు
టున్న వాడల్లా యిప్పుడు Right royal యుద్ధాలు ప్రా
భించాడు. ఉత్తరాల దగ్గిరా అంతే! అతనికి ఇష్టమై
ఉత్తరాలు చదవ వలసిందే. ఇంకే వుత్తరాలు చదవని
వీల్లేదు. ప్రతిదానికీ వుగ్రుడౌతున్నాడు. పెద్దగా ముక్కు
తెరిచి గుడ్లు పెద్దవిచేసి, బకాసురుడిమల్లే మీదికి దూకుతా
మరీ కోపం యెక్కువై పరవళ్ళు తొక్కుతాడు. "చూడండి
ఈ తాంద్ర పాపారాయుణ్ని చూడండి" అని తనే అన్న
న్నట్టుగా వున్నాడు. అతనికి వాళ్ళు యెదురు చెప్ప
పోవడంవల్ల, తాను చాలా శక్తివంతుణ్ననీ, అతని కోప
చూస్తే వాళ్ళకి భయమని అనుకుంటున్నాడు. తన ప్రా
మెంతో తెలీక, అతనికి తాంద్ర యిష్టం. పటీర్ పటీ
తాంద్ర తింటున్నాడు. అందుకని అతనికి తాంద్ర పాపా
రాయుడని పేరు పెట్టాడు నాన్న. అద్దం దగ్గిర పిచిక
మధ్యాహ్నం వరండాలో అవి కట్టుకుంటున్న గూటికోస
డ్డి పరకలు యేరుకుంటున్నాయి. బుజ్జిగాడు దూరంనిం
శాడు. గబగబ వెళ్ళి "ఎవరిదనుకుంటున్నారు ఈ గడ్డి
తాత సొమ్మా" అంటున్నట్టుగా వాటిమీదికి పరిగె
టి మొహంమీదికి కాలు విసిరాడు. వుత్త రౌడీని, బల్లి
నాడు వీడు.





పుట్టినప్పుడు సోమవారాలూ శుక్రవారాలూ
లో సన్నాయి వింటాడు. బుజ్జిగాడికి సన్నాయి
! అక్కడక్కడ కలిసి పాడతాడు. కాని ఆషా పాట
యిష్టంకాదు సన్నాయి.

మనుషులకి యిష్టా యిష్టాలెట్లా యేర్పడతాయో, నిర్ధా
గా యెవరూ నిర్ణయించలేరు. మానసిక శాస్త్రం చిన్న
అలవాట్లంటుంది. కొంచెంగా Heriditary disposition
ంటుంది. జన్మలలో నమ్మేవాళ్ళు జన్మాంతర వాసన
రు. ఈ పిట్టలకి అట్లాంటివి ఈ జన్మవో, పోయిన
వో అలవాట్లు వుంటాయా? ఆషా పాటలకి,
షేక్స్పియర్ నాటకాలకి, బుజ్జిగాడికి సంబంధం—ఇష్టాలు
యేర్పడి వుంటాయి. పూర్వ జన్మల్లో యితను
—అనడం తప్ప యింకేం కనపడదు.

అట్లా జన్మం సంగతి, యెత్తుకోకపోతే పక్షికి షేక్స్పి
డు, ఇంగ్లీషుభాష అందులో పూర్వపు భాష యెట్లా అర్థ
వుతుంది! లేక ఆ భాషలోని Musical vibrations ఇతని
కి నచ్చాయా? ఆ విలువలు ఆ భాషలోనే వుంటే తక్కిన
పిట్టలూ, మృగాలూ, పిల్లలూ ఈ విధంగా షేక్స్పియరుకి
React అవుతారా? ఈ బుజ్జిగాడిలో ఈ శక్తి యెట్లా
వొచ్చింది? కాకులూ, పిచికలూ, పిట్టలుకోతులు, నెమళ్ళు. ఈ,
యింటి చుట్టూ వుండనే వుంటాయి. గోరింకలూ వాలతాయి.
ఇంకేవేవో పిట్టలు Visit చేస్తాయి. కాని ఒక్కటీ ఈ ఆసక్తి
చూపదే!

ఇవాళ సాయింత్రం బుజ్జిగాడు పై టికిపోయి
రాతేదు. సాయింత్రాకాశం అతన్ని ఆకర్షించి తీసుకుపో
దని అమ్మ సూర్యాస్తమయాన్ని కోప్పడుతోంది.
మాటలు వింటే బుజ్జిగాడు చెట్టుమీద కూచుని పడమట
చూసి, ఆ రంగులకి ఆ మెరుపులకీ, మంటలకీ, వెలుగు
ఆగలేక ఏ గమ్యస్థానమూ లేకండా ఆ Sun-setలోకి సూటి
యెగిరిపోయివాడనే Superb picture వస్తుంది.

## ప్రౌఢ ప్రియుడు

సెప్టెంబరు 1

పొద్దున్నే తిరిగి వచ్చేశాడు. Shark-liver oil తో
గా వెక్కుతున్నాడు. ఇతనికి కబ్బర్దులో రాత్రులు వుక్కగా
వుంటుంది. అందుకని వెడుతున్నాడు అనుకున్నారు. పెళ్ళ
ంజరం చేస్తానని శపథం చేసిన బసవరాజుగారు యింకా
ప్రారంభయత్నాలలోనే వున్నారు. రాత్రులు నక్షత్రాల కింద
ట్టుపైన వుయ్యాల లూగుతో నిద్రపోయే అనుభవాన్ని నిరా
రించుకుని వస్తున్నాడంటే అతని ప్రేమబలం. ఆ ప్రేమ
ంతటి త్యాగాల్ని సునాయాసంగా అనాలోచితంగా చేయ
ందో అర్థమౌతుంది. ఈ పిట్టల్ని శాస్త్రజ్ఞులు వుత్త instincts
ని, తెలివిలేనివని పేర్లు పెట్టి తుడిచేస్తారు. పిట్ట చెట్టుపైన
ద్రపోగలిగి కూడా ఆ చెట్టుని వదలి, స్వచ్ఛందంగా



వుక్కతో చీమల్లో రాత్రి గడపడానికి రావడం
instinct ఏనా? దాంట్లో ఆలోచన లేదా? శాస్త్రజ్ఞుడా
న్నా ప్రేమకి ఆ మాత్రం త్యాగం చేశావా? అట్లా
స్తే మానవుడి ప్రతిపని instinct. ఏమాత్రం బుద్ధితో,
తో, చేస్తున్నారు పనులు? చేస్తున్నట్టే కనబడుతు
మనుషులు! మీరు కావ్యాలనిండా పొగిడే మాతృ
త్యాగం instinct కాక యింకేమిటి ?

ఈ పక్షుల్నీ, పశువుల్నీ కూడా తమ మనసుల్లో గౌర
, వాళ్ళ పనులకి ప్రేమలకి ఓ గౌరవం యివ్వడం
, మనిషినీ, అతని ఔన్నత్యాన్నీ పురుగులని పురుగుల్నీ,
పశువుల్నీ కూడా హీన స్థితికి లాగారు. అట్లా ప్రజలని
లని, కొందరు బుద్ధిమంతులు వాళ్ళని యుద్ధానికి ఊమా
ంచి తాము పరిపాలిస్తున్నారు. అనవసరంగా ఓ పక్షీ
, జంతువుగాని కక్షపట్టి యింకో ప్రాణిని చంపుతుందా?
కూడబెట్టుకుని, ఇతరులకి లేకండా చేసి, నేను తెలివి
వాన్ని! నా అదృష్టం! ఎవరెట్లాపోతే నాకేం? అంటుందా?

## దాబాపై ప్రేయసితో

పొద్దున్నప్పుడు రోజూ షా ధ్యానంలో కూచున్న
డు దాబామీద పాకదగ్గరికి వస్తాడు. ఇతనికి ఓ ప్రియు

రాలు దొరికినట్టుంది. ఇతను డాబాపైకి రావడంచూసి కూడ ఆ సమయానికి వచ్చి పక్కనున్న చెట్లమీద పాటలు ప్రారంభిస్తుంది. ఇతను ఆ పాట వినగానే దగ్గిరికి యెగిరిపోతాడు. ఇద్దరూ కలిసి కొమ్మనించి కొమ్మకి చెట్టునించి చెట్టుకి యెగురుతారు. ఆ ఎగరడమూ, గంతులూ అరపులూ, పాటలూ చూస్తే it is all unalloyed spontaneous joy లోపల్నించి వచ్చే సంతోషం. ఆకుపచ్చ ఎండ చారల్లో చల్లని గాలిలో ఆ వూపు, ఆ నిష్కల్మష స్నేహం, ఆ అమాయకత్వం చూస్తోంటే అట్లాంటి స్నేహం కోసం ప్రాణం పీకేస్తుంది. తెలిసేవి, తెలియక మనసు బరువెక్కించేవి ఎన్ని భారాల్ని నేర్చుకున్నాడో మానవుడు తాను ఘనుణ్ణని ఈ ప్రాణుల్ని నీచంగా చూస్తాడు నిమిషమూ నమస్కరించక!

చిన్నపిల్లలు పల్లెటూళ్ళలో అట్లా ఆడతారు. యెక్కడ సంతోషపడిపోతారో అని, వాళ్ళ భవిష్యత్తు పురోభివృద్ధి education అంతశ్శక్తుల్ని బైటికి లాగడం ఔన్నత్యం. భావిపౌరులూ, ఇట్లాంటి మురికి పేర్లని త్రంగా వుచ్చరిస్తో పిల్లల ఆనందాన్ని బలి పీఠం బలి యిస్తారు. నీతి, వంశం, డబ్బు, మర్యాద అంటో మనసుల్లో ప్రేమని చంపేశారు.

# డైలీ రొటీన్

భోజనవేళకి ఆమెని యెట్లాగో వొదిలించుకుని వొచ్చే



భోజనం చేసి, వాళ్ళ భోజనాలకి తన అల్లరులతో ... పుత్తరాలు వింటాడు. ఇంతసేపూ భోజనాల గది ... రోడ్డుపక్క చింతచెట్టు పైని కూచుని పొడుతోనే ... ఇతని ప్రియురాలు. పూర్వం మానవుల్లో కూడా ... ప్రేమికుల ప్రేమ యిట్లానే జరిగేది గావును! అక్క... బైబిల్లో, వేదాల్లో, పురాణాలలో యిటువంటి ... తొంగిచూస్తో వుంటుంది. Old testament లో Ruth ... రేచల్ కోసం జాకబ్, సాలమన్ ప్రణయగీతం, ... కోసం పురూరవుడు, లైలా కోసం మజ్నూ, నిక ... కోసం అకాసిన్, కచుని కోసం దేవయాని ఇట్లా యెన్నో ... అటూ చూడకండా ఈ పక్షులవలె ఆటలూ, ప్రేమలూ. ... యెవరు నిమగ్నం కాగలరు ఈనాడు! అట్లా బనారని ... కథలు యెంత బూతు!

భోజనం కాగానే ఇతనూ ఎగిరి ఆమెతో రోడ్డు ... చింతచెట్టు మీద కూచుంటాడు. ఇద్దరూ మధ్యాహ్నం ... గంటలు ఆ ఆకు నీడల్లో, ఆకుపచ్చ మందిరాల్లో, ... హాయితో కునికిపాట్లుపడే గంటలన్ని (దుమ్మెత్తి ... బస్సు శబ్దాల్ని లక్ష్యం చేయక) వూగుతూ, ప్రేమతో ... పాడుకుంటారు. ఆ పాటలే వేరు. ఆ భాషలే వేరు ఒక్క ... కిటికీ దగ్గిర కూచుని కలలు కనే పకపక దగ్గిరికి ... రొట్టె తింటాడు బుజ్జిగాడు. కాని ఆమె- ఆమె ఇతని ... కోసం తన జుట్టుని వొదిలింది. తిండి మానింది. ఇతను వెళ్ళి ... పోయిందాకా. Good Bye చెప్పిందాకా అట్లా కూచునే ... వుంటుంది. ఇద్దరూ Duets పాడతారు. కబుర్లు చెప్పుకుంటారు.

బుజ్జిగాడు మనుషులతో పకపకతో మాట్లాడే భాష చిన్నపిల్లవాడి భాష. అమెతో మాట్లాడే భాషవేరు. అతను ప్రౌఢ ప్రియుడు.

ఇంకెంత కాలం నిలుస్తాడు. ప్రేమని మించిన ప్రవేశించింది అతని హృదయంలోకి! ఈ ప్రేమ సహజమైనది అతని హృదయంలోకి! ఈ ప్రేమ రసంతో నింపేది. కాని పకపకపైన ఎంత బలమై ప్రేమ. పకపక కనపడుతో వుండాలనే వాళ్ళిద్దరూ చింతచెట్టు పైన కూచోడం.

అట్లా కూచుంటారు వాళ్ళిద్దరూ చాలాసేపు. వెళ్ళాలని ఆమెతో చెప్పి శలవు తీసుకుని ఇంట్లోకి దిగి వొచ్చేస్తాడో ఏమో. తన దేవకన్యని ఏడుస్తో నాట్యసభకి వెళ్ళమని వొదిలే మానవ ప్రభువలె తుంది గావును. ఆమె బుజ్జిగాణ్ణి కిటికీలోంచి ఇంట్లో వద్దని బతిమాలదా? అదేం ప్రేమ ఆ మనుషుల పైన ఎక్కిరించదా?

ఆమె దగ్గిర శలవు తీసుకుని వొచ్చి పకపక వాలతాడు. ఇంతసేపు తాను వెళ్ళినందుకు పరిహారం నట్టు ఎన్నో ఆటలాడుతాడు. గోములు చేస్తాడు. పాడతాడు. ఒకటే కబుర్లు చెబుతాడు. ఆ పలుకులే అవన్నీ తన ప్రియురాలి సంగతులేమో! తన ప్రణయ లీలలూ, ఆమె పైన కవిత్వాలేమో.



పొద్దున మధ్యాన్నం పకపక సినిమాకి వెళ్ళింది. భోజనాలలో నాన్న, షా చదువుకుంటున్నారు. ఇంట్లో లేరు. ప్రియురాల్ని వొదిలి, కిటికీలోంచి బుజ్జిగాడు ఇటూ అటూ వెతుకుతున్నాడు. "ఏం కావాలి! కావాలా?" అని అడిగింది షా. బ్రెడ్ అనేమాట విన భోజన స్తలానికి దూకాడు. బ్రెడ్ పెడితే తిన్నాడు కుండ వేపు నడిచాడు. నీళ్ళు పడితే తాగాడు. సాయంత్రం దాకా ఏవేవో కబుర్లు చెపుతాడు. సంగతులేమో. సాయంత్రం పకపకని డాబాపైకి వెళ్ళి ఆటలాడతాడు.

సెప్టెంబరు 17

......

బుజ్జిగాడి పంజరం తయారౌతోంది, రాత్రులు అతనికి గా వుంటోంది గనక అతన్ని ఈ పంజరంలో పెట్టి లో తగిలించాలని ఆలోచించారు. కాదు చెట్టుకి తగి ఇంకా సుఖంగా వుంటుందని ఒకరు. కాదు చెట్లచీకట్లో కుంటాడు. లేక పాములు పంజరంలో దూరతాయని చెట్లకిందగాని సరైన గాలిరాదని, నక్షత్రాలు కన చెట్లకే కట్టాలన్నారు. వీల్లేదని అమ్మ. చెట్లకి కట్ట పీలులేకపోనీ, రోజూ చెట్ల కొమ్మలు పువ్వులున్నవి పంజరం చుట్టూ కట్టాలని, పంజరం కప్పకి ఆకాశం పింగా రంగు వెయ్యాలని నక్షత్రాలు కూడా చిత్రిం

చాలని. చంద్రుడి లాగు తళుకు రేకో, ఏదో దినదినమూ చంద్రవృద్ధి క్షయాలు చూపాలని, ఆకాశంలో పైకి లేస్తున్నట్లు మెకానిజంచేత పని లని ఇట్లా పేలిపోయినాయి సలహాలు విపరీతంగా!

## చీమపై దాడి

సెప్టెంబ

పొద్దున మామూలుగా ధ్యానంలో కూచుం పైన పాకలో తక్కిన ఇద్దరూ కూచుని వున్నారు. వొచ్చి ఓ చీమని చూసి వేటాడుతున్నాడు. ఆ చీమ శరణుజొచ్చి లుంగీకింద దూరింది. తరుముతో బుజ్జిగాడు. నాన్న చీమ రక్షణకి చేతిని అడ్డం కోపం వొచ్చి నాన్నని పొడిచాడు బుజ్జిగాడు. ఆ వెళ్ళి ఆ పక్కన పడుకుని నిద్రపోతున్న లక్కీని పొడిచాడు. ఉలిక్కిపడి లేచి బాధతో అరుస్తో నాడు లక్కీ.

"నిన్ను గద్దలనించి, కాకులనించి కాపాడతా లక్కీని అన్యాయంగా పొడిచావు. సిగ్గులేదా? చూసి ఊరుకున్నాడు కానీ, లేకపోతే వాడి నువ్వెంత?" అని కోప్పడ్డది షా. చిత్రం లక్కీ బుజ్జిగాడ్ని పట్టుకోడానికన్నా చూడలేదు. మొదట్లో పడ్డారు, అంతే.





## పోయిన సలహాలు

రాత్రి పకపక అందరికీ మామూలుగా వొడ్డిస్తోంది. భోజన వేళ, పకపక పనిమీద వుందికదా అని యినాడు ప్రియురాలి దగ్గిరికి. పకపక లేదుగా

అప్పుడప్పుడు ఆ ప్రియురాల్ని తనతో ఆ ఇంట్లోకి మని బుజ్జిగాడు పిలుస్తున్నట్టు కనపడుతుంది. "వాళ్ళు నిన్ను. వాళ్ళు మంచివాళ్ళు. నువ్వు వొస్తే నీకు పెడతారు."

"బ్రెడ్ ఏమిటి?" అంటుంది ఆమె. "బ్రెడ్డా!" అది చాలా బావుంటుంది. తెల్లటిది ఇంకోటి వుంది. నీళ్ళ దాన్ని పాలు అంటారు. దాంట్లో బ్రెడ్డుని నానేసి తారు. రా!"

"నాకు బ్రెడ్డూ వొద్దు ఏమీ వొద్దు. నువ్వు లక్ష నేను మనుషుల్ని నమ్మను. నాకు భయం,"

ఇట్లా మాట్లాడుకుంటారు గావును వాళ్ళు.

అప్పుడప్పుడు బుజ్జిగాడి ప్రియురాలు చెట్టుమీద నించి గోడమీద వాలుతుంది. ఇంట్లోకి వొచ్చేస్తుందేమో స్తుంది.

పకపక సినిమానించి వొచ్చిం తరవాత బుజం మీద "నన్ను వొదిలి ఇంతసేపు ఎక్కడికి వెళ్ళా"వని ఏడ్చాడు. తను వెళ్ళవొచ్చు. పకపక ఇంటోనే తను వొచ్చేప్పటికి హాజరుగా.

భాష నేర్చుకున్నానని, భాషవల్ల తనకి ఆగో
బలమూ మనోవిశాలత్వము హెచ్చాయని మానవు
మాటలు తమ భావాల్ని దాచుకుని ఇతర్లని మెప్పి
డానికి ఎక్కువ అనుకూల పడుతున్నాయి.

పక్షులు మాట్లాడుకోలేవేమో! ఆ స్వరాల్నీ ప
షాన్ని, ప్రేమని, దుఃఖాన్ని, కోపాన్ని
Elementary Emotrons ని తమకి తాము Express చేసు
నికే వుపయోగపడతాయేమో మనుషుల్లో మాటలులేని గా
వలె. పశువులూ, పక్షులూ, మాటలులేని వాళ్ళ
మాట్లాడుకునేట్లున్నాయి. అబద్ధమూ మోసమూ లేకుండా

సెప్టెంబరు 1

సాయంత్రం వెళ్ళి బుజ్జిగాడు తిరిగి రాలేదు.
గాలి, మబ్బు, వాన చినుకులు. అమ్మగోల. ఏమైపోతా
చినుకులకి తడుస్తాడో, గాలికి చెట్టునించి కిందికి ప
పోతాడోనని. రాత్రి చాలసేపు లైట్లు వేయించి వుం
తిరిగి వొస్తాడేమోనని. వాళ్ళు భజన చేస్తోంటే, తను
మీద పడుకుని వరండాలోంచి వుండుండి కేకలు "రా
నాయనా! ఈ చీకట్లో భయం వెయ్యటం లేదురా! వా
చినుకులురా. లోపలికి రా రా. నాయనా! అంటో.



వెతికించింది అతనికోసం. ఆ ప్రియురాలు
ఎక్కడికో దూరం తీసుకుని వెళ్ళిందని, అతను
రాకుండా అడ్డు పడిందని, వానవల్ల బుజ్జిగాడు
నిద్రపోయి వుండదనీ, ప్రియురాల్ని తప్పించుకుని
ఒకటే గోల. ఆ ప్రియురాల్ని తిడుతో. ఏమిటో
మీద అంత విడవలేని ప్రేమ అమ్మకి. ఆ బుజ్జిగాడు
కైనట్టూ, ఆ రెండో పిట్ట తన కోడలూ, తన కొడుకు
నించి వేరు చేసి తీసుకుపోయినటూ మాట్లాడుతుంది.
వయసు వొచ్చేప్పటికి అప్రయత్నంగా వొస్తుంది.
అప్పుడు ఈ కోడలి మీద ఈర్ష్య ఎవరిమీదో వొకరి
చూసి తీరాలి. అందుకనే ఎంతో మంచి కోడల్ని ఐనా
ఆడిపోసుకుంటోనే వుంటుంది. పిట్టని అంటారు గాని
మాత్రం ఏ మాత్రం తెలివి చూపుతాడు? ఆ ఆడపిట్ట
ఆ కోపమేమిటి అమ్మకి. ఇంతా అమ్మగోలే కాని బుజ్జి
అమ్మపైన ఏ శ్రద్ధా చూపడు. చాలమంది కొడుకులూ
అంతేగా!

సెప్టెంబరు 16

తెల్లారే అతను తిరిగి రాలేదు. అమ్మకి ఏం తోచదు.
"బుజ్జిగాడా! నాయనా, బుజ్జిగా!" అంటో అడవుల వెంట
వంటాలేదు. ఏ పనీలేదు. నాన్న వాళ్ళు నవ్వు

తున్నారు. కాని ఎంత విషాదమో ఆ పిట్ట కోసం
కడంలో. వెతికి, వెతికి, పిలిచి, పిలిచి, అలిసి ఇల్లు చేరు
అక్కడితో వివేకం స్ఫురించింది. అతన్ని ప్రియు
ఎట్లాగూ వుండనీడు ఇక్కడ. ఎన్నాళ్ళు మనుషులపైన
నిలుస్తుంది పిట్టకి? త్వరలో ఎట్లాగో వెళ్ళిపోయేవారి
పైన మనసు పెట్టుకుని ఏం లాభం? అనుకుని విరక్తి
కోవాలని "మమకారాలు, వెధవ మమకారాలు" అని
తాను బోధ చేసుకుంటోంది.

పైన పాకలో షా ధ్యానంలో వుండగా
వుండనగా డాబాపైన వాలాడు. సూటిగా కిందికి,
లోంచి Parachute లో వూడి పడ్డట్టు. అతని వెంట ప్రి
రాలూ కూడా వొచ్చింది. ఆమె ప్రాబల్యం హెచ్చు
బుజ్జిగాడి హృదయం పైన. ఒకవేళ ఆశ అతను
నిలవాలంటే ఆ ప్రియురాలు వాళ్ళకి మచ్చిక
వొప్పుకుంటుందా ఆమె! ఏమో! ఎప్పుడో ఇద్దరూ
లోంచి గదిలో వాలవొచ్చు.

భోజనాల దగ్గిరికి వొచ్చాడు మామూలుగా.
నంతరం ప్రియురాలితో కలిసి ఒక చెట్టు మీద
డ్యూయెట్టు పాడాడు. మధ్యాన్నం వొక్కడూ వొచ్చి
దగ్గిర కూచుని, చదువుకోనీకుండా గోలచేశాడు రోజు
పుస్తకం పీకుతాడు. పుస్తకం చింపెయ్యాలని



తమ అతనికి రొట్టె పెట్టబోయింది. అతను నోరు
సరికదా, అమ్మని కరవ వొచ్చాడు. అమ్మ
కోప్పడుతో వెళ్ళిపోయింది. పకపక వెళ్ళి పెడితే
డు. మరి పకపక తనని వుపేక్ష చేసిందని కోపమో,
Serve చేస్తోందని ఈర్ష్యో! పకపక యింట్లో లేన
గోలచేసి అమ్మని పిలిచి తిండి పెట్టించుకుంటాడు.

కాసేపటికి పని వుండి Meat shelf తెరవడానికి
తే, తెరవనీకండా అడ్డం వెళ్ళి పొడవడానికి వొచ్చాడు,
తనకి రొట్టె పెడదామని వొచ్చిందనుకున్నాడో
ఇంకాసేపు వుండి అమ్మ కబ్బర్డుమీది Flask తీసుకో
వొస్తే, అతను అమ్మకేసి దూకి అడ్డంగా వెళ్ళి
Flask ని ముట్టుకోనీలేదు. ఇవాళ అతనికి అమ్మ యేమన్నా
కోపం తెప్పించిందా ?

"వుండరా నీ పని చెపుతాను" అంది అమ్మ బెదిరిం
గా! "కే, కే" అన్నాడు. "నేను మాత్రం నీ పని చెప్ప
లేనా" అన్నట్టు ధ్వనించింది.

సెప్టెంబరు 20

## పంజరం

బుజ్జిగాడికి పంజరం తయారయింది. రేపటినించి
అతన్ని ఆ పంజరంలో పెడదామనుకుంటున్నారు.

## కౌజుపిట్టలు

సెప్టెంబరు 2

ఇవాళ పొద్దున్నే బోయవాళ్ళు కొన్ని పిట్టల్ని తినే వాళ్ళకి అమ్ముదామని వూళ్ళోకి తీసుకు పోతున్నా వాళ్ళనించి నర్తకి రెండు కౌజు పిట్టల్ని కొంది. బుజ్జిగా వుద్దేశించిన పంజరంలో వాటిని పెట్టింది. బుజ్జిగాడు వా వంక చూడనన్నా లేదు. కాని తన పంజరం ఆ పి కిచ్చారని గమనించాడా?

## పాత జన్మల స్మృతులు

సెప్టెంబరు 2

ఇవాళ షా Merchant of Venice లో final scene చదువుతోంది. బిగ్గరగా నాన్నకి, నర్తకికీ. అంతసేపూ బుజ్జిగాడు వింటో కూచున్నాడు చాలా శ్రద్ధగా. ఒక్క ముక్క యెక్కడ తప్పిపోతుందో అన్నట్టు రోజూ వింటాడు. కాని యివాళ అతనిలో ప్రత్యేకమైన శ్రద్ధ కనపడుతోం వింటో మధ్యమధ్య క్లుక్, క్లుక్ అంటున్నాడు. షా మధ్యలో ఆపి చదివినప్పుడు ప్రతీ రోజుమల్లే తానూ అరవటంలే వూపిరి బిగపట్టి వింటున్నాడేమో ననిపించింది. షా ముగించి వెళ్ళిపోయాక కూడా ఎక్కడా చలనం లేకండా అట్లాగే



న్నాడు ఆలోచిస్తో చాలాసేపు. మరి ఆ సీన్ పాత స్మృతుల్ని రేపిందో ఏమో!

సాయంత్రం ప్రతిరోజూ బుజ్జిగాడూ, పకపకా డాబా కుంటున్నారు. తక్కిన వాళ్ళు షికారు వెడతారు.

సెప్టెంబరు 23

## నలో పాపం

బుజ్జిగాడు రోజూ సాయంత్రం వెళ్ళి యింటివెనక లంలో పురుగులేరుకుంటో వుంటాడు. అక్కడికి తక్కిన కలు కూడా వస్తోవుంటాయి. కాని యితను వాటి న్నా తలయెత్తి చూడడు. ఇవాళ సాయంత్రం వాన ది. వాన వచ్చినా బుజ్జిగాడు తిరిగి రాలేదేమా అని, కులు తగ్గగానే అతనికోసం వెతికింది పకపక. పొలంలో స్తే తక్కిన గోరింకలు యెగిరిపోయినాయి. ఇతను డూ కూచుని వున్నాడు అక్కడే. పిలిస్తే చూస్తాడు. కులు చెపుతాడు. కాని రాడు. దగ్గిరికి వెళ్ళిచూస్తే అతను నలో తడిసి, నీటి బరువుతో యెగరలేక అక్కడే కూచుని న్నాడు. పకపక అతన్ని యింట్లోకి తీసుకొస్తోవుంటే, నలో తనుపడ్డ అవస్థ చెప్పుకుని ఏడ్చాడు. పకపక చూసి సుకురాకపోతే చచ్చి పోయేవాడే. ఏ కుక్కో యెత్తుకు

పోయేది. అతన్ని తీసుకొచ్చి పకపక పొయ్యిదగ్గర కా...
తడిపోయేదాకా హాయిగా కాపించుకున్నాడు.

## పై తిరుగుళ్ళు

సెప్టెంబ...

రోజులో చాలాసేపు వెళ్ళిపోతున్నాడు రాత్రి... యింట్లో వుండటంలేదు. వేళకి వొచ్చి రొట్టె తిని... వెంటనే వెళ్ళిపోతాడు. ఒక్కొక్కప్పుడు ఒంటరిగా... ప్రియురాలితోనే ఎదురు చెట్లమీద వుంటాడు. ఒకప్పుడు... పడడు.

సాయంత్రాలు మాత్రం డాబాపైన పకపకలో ... కుంటున్నాడు.

## చిటారి కొమ్మన

సెప్టెంబరు ...

అమ్మ నేర్పితే "చిట్టిపాప" అంటున్నాడా అని... చేట్టుధ్వని చెయ్యడం నేర్చుకున్నాడు. అతను పొద్దున వె... పోయి తిరిగివచ్చి చింతచెట్టు చివరి కొమ్మమీద అం... ఆకాశానికి దగ్గిరిగా ఒక్కడే కూచుని యిటూ, అటూ చూస్తో వుంటాడు. ప్రియురాలి కోసమేమో! వాడి అమ్మ చిటారికొమ్మన మిఠాయిపొట్లం అంటోంది.







## ...గరు మిత్రులు

...తనికోసం యిప్పుడు ఒకటికాదు రెండు గోరింకలు ...యి. కొన్ని రోజులనించి వచ్చి చెట్లమీద కూచుని ...కేకలేస్తాయి. ఇతను వెదతాడు. మూడూ కలిసి ...పోతాయి.

సెప్టెంబరు 27

## ...దిలేని పిట్టలు

పొద్దున్నే బుజ్జిగాడు వెళ్ళిపోయినాడు. రొట్టె తినడా ...కూడా తిరిగి రాలేదు. అమ్మ అతనికోసం దొడ్లో, అడ... తిరుగుతోంది. "నీకోసం రొట్టె నానవేసి వుంచానురా, ...తీసిపెట్టాను. రొట్టె తినిపోతే నిన్నెవరడుగుతారురా! ...తినడానికి కరువైనావా?" అని ఎన్ని గంటలు తిరి... ...! ఆ మాటలు విన్నవాళ్ళంతా ఒకటే జాలిపడటం, ...టని అడగడం, ఆ వెతకడం పిట్టకోసం అని విని, వాళ్ళకి ...శ్చర్యం.

ఎండకొట్టి, దాహంపడి, మధ్యాన్నానికి వచ్చాడు, ...దూరంనించి. ఎంతో రొట్టె తిన్నాడు. ఒకటే నీళ్ళు ...గాడు. ఆ పిట్టలమీద చాల కోపంగావుంది అమ్మకి. అవే ...న్నంత దూరం తీసుకుపోయాయని.

"బాగానే పిలుచుకుపోతారే! తీసి తెచ్చిన మా నాయనకి తిండి పెట్టాలనీ నీళ్ళు పట్టాలనీ అట్లాంటి బుద్ధిలేని పిట్టలతో నువ్వెందుకు పోళ్ళ అంటోంది.

## డ్యూ యె ట్స్

సెప్టెంబరు

పొద్దున్నే రోజూ ఆ రెండు గోరింకలతోనూ పోతున్నాడు. ఆ గోరింకలు ఇతని తల్లీ చెల్లెలూనా! ఇతని యిద్దరు సోదరులా. లేక మిత్రులా. ప్రియురా మధ్యాన్నం ఆ మూడు గోరింకలూ వొచ్చి యింటికి, మధ్యనున్న చింతచెట్టుమీద పకపక కిటికికి కూచుని Duets పాడుతున్నారు. ప్రతి సాయంత్రం తీసుకుని వొచ్చి యింటి దగ్గిర దిగపెట్టి వెళ్ళిపోతున్నా వాళ్ళిద్దరూ.

## షా మె లీ త్రో —

సెప్టెంబరు

ఇవాళ బోయవాళ్ళు కొత్త పిట్టలతో వొచ్చారు కానికి. నర్తకి మూడు అడవి పిచిక పిల్లల్నీ, ఒక గోరింక కొన్నది. పిచికలు చాలా పసివి. గోరింక రెక్క విరిగింది.



గోరింక బుజ్జిగాడి కబ్బర్డులో పెట్టారు. రాత్రి బుజ్జి వొచ్చి కొత్త గోరింకని చూసి కొంచెం వెనక్కితగ్గి న్నాడు. ఈ యిద్దరికీ స్నేహమైతే బావుండునను న్నారు

బుజ్జిగాడికి యౌవనంవొచ్చి గూడుపెట్టే రుతువు రాగానే వెళ్ళిపోతాడని ప్రతివారూ అంటున్నారు. ఆ రుతువు పోగానే తిరిగి వొస్తాడని ఆశ. భార్యనీ, పిల్లనీ వెంట పెట్టుకుని వొస్తాడని కలలు.

బుజ్జిగాడు మొగావాడో, ఆడదో తెలీదు. ఈ కొత్త గోరింక ఆడదో, మొగవాడో తెలీదు. బుజ్జిగాడు మొగ వాడూ, కొత్త గోరింక ఆడదీ ఐతే యిద్దరూ కబ్బర్డులో కాపురం పెట్టి యిక్కడే నిలిచిపోతారని వీళ్ళ ఆశ.

స్నేహం చేద్దామని రాత్రి బుజ్జిగాణ్ణి కూడా ఆ కబ్బర్డులోనికే పొమ్మన్నారు. కొంత అనుమానించి చివరి కెళ్ళాడు. అతనికి కోపం వొస్తుందేమోనని నాన్న భయం. బుజ్జిగాణ్ణి చూసి కొత్త గోరింక భయపడి దూరంగా ఓ మూల దాక్కుంది శోభనం వెళ్ళకూతురులాగు. కాని బుజ్జిగాడు ఏమీ పెళ్ళికొడుకులాగు కనపట్టంలేదు. దీపాలార్పి భజనకి వెళ్ళి పోయినారు. కాని అమ్మ వింటోనే వుంది. కొంచెం సేపట్లో కిచకిచ ధ్వని. వెళ్ళి చూస్తే పోట్లాడుకుంటున్నారు. కొత్త గోరింకని కబ్బర్డు పై అరలో వేశారు.

# కొత్తపిట్టల రాక

రోజంతా వెళ్ళిపోతున్నాడు రొట్టె తినడానికి రావటంలేదు. రాత్రి మాత్రం వొస్తున్నాడు ఇంట్లో గైదు పిట్టలు పెరుగుతున్నాయి. అవి వున్నాయని తె కాని వాటివంక చూడడు. అవి వుండటం అతని కష్టమేమో తెలీదు. అతని దృష్టి అంతా పకపక మీదే. దృష్టి అతని మీద.

ఇవాళ సాయంత్రం డాబామీద పకపకతో కున్నాడు. పకపకకి పని వుండి కిందికి రావాలనుకుంది అతను వెళ్ళవొద్దని అడ్డుపడ్డాడు.

కొత్త పిట్టలు రావడం, తనవారిదృష్టి వాటిమీదపడ నిలపడమూ అతనికి తెలుస్తోనే వున్నట్టుంది.

# పకపక ప్రేమ తనకే

ప్రొద్దున్నే వెళ్ళిపోయినాడు. మధ్యాన్నం ఓ గుం గుంపూ గోరింకలు వచ్చి చింతచెట్టుమీద వాలాయి. ల్లోంచి బుజ్జిగాడు వూడిపడ్డాడు. పకపక దిగులుగా గదిలో పడుకుని వుంది. అమ్మ అతనికి రొట్టె పెడు వుండగా, ఓ పెద్ద రొట్టె ముక్కని పట్టుకుని యెగిరి పో



తన మిత్రులకి పెట్టటానికో ఏమో ! ఆ రొట్టెని రుచి రుచితో మరిగించి, వాటిని లోపలికి తీసుకురావా !

గోరింకలే బుజ్జిగాణ్ణి రానివ్వటంలేదు. వాటిని కొస్తాడు గావును. అతని కోసం అవి కాచుకుని యి. అతను రావడం ఆలస్యమైతే మధురంగా పిలు రమ్మని. ఎక్కువకాలం అతను వుండడని తెలుస్తోంది. రింకలకి యితనిపైన అంత పట్టెందుకో మరి! ఇతనిలో శేషమో! లేని మిత్రుడి పైని మమత మాత్రమేనా?

సాయంత్రం వాన కురవడం ప్రారంభమయింది. గారు వొచ్చి పకపక దగ్గిర వాలాడు. పకపకని డాబా రమ్మంటాడు. వాన కురుస్తోంది యెట్లా రాను ? టుంది పకపక. కాని అతనికేం లక్ష్యం వాన! మామూ బడే వాన అతనికి అయిష్టమే. కాని పకపకని డాబా తీసుకుపోవడానికి అతనికి వాన లక్ష్యంలేదు. ఒకవేళ లో ఆడుకుందామని అతని వుద్దేశ్యమేమో !

కొత్త పిట్టలొచ్చాయని తెలిసి తన గూటిని కూడా చ్చారని ఈర్ష్యపడి పకపక ప్రేమని తనకే నిలుపు నానే ప్రయత్నమూ ! అన్నీ తెలిసిన బుజ్జిగాడికి ఆ త్రం తెలీదూ? తననికాక వేరే పిట్టల్ని తెచ్చుకున్న ఈ మనుషుల్ని యెట్లా నమ్మడం అనుకున్నాడా ?

# ప్రతి గోరింకా పలికె

ఒక్కొక్కరోజు యితని గోరింకల గుంపు ... చెంతచెట్టు మీద కూచుని బుజ్జిగాడి కోసం పిలుస్తాయి ... యింకో గుంపుతో వెడతాడో, లేక విడిగా యెక్క ... వెడతాడో, వాళ్ళల్లో బుజ్జిగాడు వున్నాడేమోనని ... "బుజ్జిగాడా" అని పిలిస్తే, అవి ఏదో జవాబు చెప్ప ... అతను తమలో లేడని చెపుతాయో! ఏమో!

ప్రతిరోజూ అమ్మ అతని కోసం పిలుస్తో, ... తోనే వుంది. ఏ గోరింక కనపడ్డా "బుజ్జిగాడా! ... అని పిలుస్తుంది. ఆ పేరు అలవాటయింది గావున ... పిలుపుకి ప్రతి గోరింకా జవాబు చెపుతోంది.

ఇవాళ బుజ్జిగాడు చాలాసార్లు వొచ్చాడు, ... కనపళ్ళేదు. తబ్బర్లు దగ్గిరికి వొచ్చి ద్రాక్షపళ్ళు అమ్మ ... తిని వెళ్ళిపోయినాడు.

పకపక యింకో గదిలో పడుకుని అతనికి కనపళ్ళే ... సాయంత్రం బుజ్జిగాడు పకపకని వెతుక్కుంటో ... లోకి వొచ్చి తనతో డాబామీదికి రమ్మని చాలాసే ... పిలిచాడు. తన విచారంలో తాను వుండీ పకపక కదలే ... అతనికి నిరాశా, కోపమూ వొచ్చినట్టున్నాయి వెళ్ళిపోయి ... నాడు.



# ... దగ్గర గోల

అక్టోబరు 4

ఇవాళ పొద్దుణ్ణించి తిరిగి తిరిగి చాలాసార్లు వొస్తోనే ... న్నాడు. పకపక లేవలేదు. అసలు కనపళ్ళేదు బుజ్జిగాడికి. ... చూసి వెళ్ళి పోతున్నాడు పకపక కోసం వొకచే ... తుక్కుంటున్నాడు.

బుజ్జిగాడు పకపక కోసం వెతుక్కుంటున్నాడని పక ... తో చెప్పారు. పకపకకి జబ్బుగా వున్నా లేచివొచ్చి ... సాల గదిలో పడుకుంది బుజ్జిగాడికి కనబడేందుకు. ... జ్జిగాడు వొచ్చి పకపక చెవి దగ్గర కూచుని వొకచే ... న్నాడు. పిలిచాడు. గోల చేశాడు. చివరికి రొష్టై పెడితే ... వెళ్ళిపోయినాడు.

# చింత చెట్టెక్కి

అక్టోబరు 5

కొంతసేపటికి నాలుగు గోరింకలు వచ్చి చెట్టుమీద ... వాలాయి. వాటిల్లో బుజ్జిగాడు. ఒకడు నర్సకి పిలిస్తే చెట్టు ... మీదనుంచి దిగి వచ్చాడు. కొత్తగా వచ్చిన పిట్టల్ని చుట్టూ

పెట్టుకుని నర్తకి కూచుని వుంది. బుజ్జిగాడు దగ్గిర తనూ ఆ పిట్టలతోనూ, నర్తకితోనూ ఆడుకున్నాడు. మళ్ళీ తన మిత్రులతో చింతచెట్టు మీద కూచున్నాడు.

కొంచెంసేపు అయినాక భోజనాల గదిలోకి వచ్చా ఇతని కోసం పకపక అక్కడే పడుకుని వుంది. ద్రాక్ష తిన్నాడు. పకపకతో చాల ప్రేమగా గోములు చేశాడు. పిట్టలు చెట్టుమీదనించి పిలుస్తున్నాయి. కాని అరగంట వరకు వెళ్ళలేదు. ఆ పిట్టలు వోపికతో కాచుకునే వున్నా పకపకని యెన్నో ముద్దులు చేసి విడవలేక విడవలేక వెళ్ళాడు. అప్పుడే గుడ్ బై చెప్పి వెళ్ళాడా? అంతే రాలేదు.

## రా రా నాయనా !

అక్టోబరు

మూడు రోజులయింది బుజ్జిగాడు వెళ్ళి. అమ్మ అతని కోసం అరుస్తో తిరుగుతోనే వుంది. పకపక అతను లేక చాలా దిగులుతో పడిపోయింది. ఇల్లంతా చిన్నబోయింది.

కాని రోజూ అతను వస్తూనే వున్నాడు. రోజులో యెప్పుడో ఒకప్పుడు ఇంటి దగ్గిర ఏ చెట్టుమీదో కూచుని



స్తుంటాడు. అందరూ పరుగెత్తుకు వెడుతో వుంటారు చినా లోపలికి మాత్రం రాడు, పిలవగానే యెగిరి ఞం మీద దూకే బుజ్జిగాడు.

తరంగేశ్వర్‌కి, జగన్నాధానికి జీవితంలో రుచే పోయి డుగుతున్నారు అతను వెళ్ళిన రోజునుంచి అమ్మకి న్నట్టయింది. బుజ్జిగాడు లేకుండానే చెట్టువంక చూస్తో, నాయనా," అని పిలిచి "ఒచ్చావా, రా, రారా, గం యెంత మొహం వాచి పోయినామురా రండ్రా బుజ్జిగాడు వచ్చాడు. రండ్రా! అతను రాకపోతే కెంత విషం అయిందిరా! నీకు ఒక్క రొట్టెముక్క పెట్టి కి నోచుకోలేదురా" అని అతని ప్రియురాళ్ళని తిడుతో స్తుంది.

## ముగింపు

అతను తిరిగి రాలేదు. ఎందుకు వెళ్ళిపోయినాడు? యౌవనం వచ్చి భార్య కోసమో! లేక వేరే పిట్టలొచ్చి సి, తన పైన శ్రద్ధ తగ్గిందనే ఈర్ష్య వల్లనా? చివరి

సంగతి ముఖ్యమైనది. పకపక తన స్వంత విచారంలో
మరచిందనా? లేక ఈ మూడూనో?

ఇంత పిలుస్తోవుంటే యెందుకు తిరిగిరాడు! సెంపకంలో నిమగ్నుడైనాడా? పోనీ ఒక్కసారి అందర్నీ యింట్లో పలకరించి పోకూడదా? లోపలికి తిరిగి పోనీరనా, లేక అతనికే తిరిగి వెళ్ళబుద్ధి కాదా ఇంట్లో అమ్మా పకపకా యెంత దిగులు పడిపోతున్నారో అతనికి తెలీదా?

ఒకవేళ అతన్నిమనుషులకు కట్టేసిన బంధం గానేఅతని మెదడులో ఆభాగం మాసిపోతుందా! వాటి విషయమై అంతేకదా! పసితనంలో పిల్లలకోసం ప్రాణం ఇచ్చే ప్రేమ కొద్ది వారాల్లో పూర్తిగా మాసిపోతుం అతనికీ వీళ్ళపైన అట్లానే మరుపు వచ్చిందా? కాని రోజూ వస్తోనే వున్నాడు? అయినా లోపలికి రాడు చిత్రం.

కాని ప్రతిరోజూ, ఇంటిదగ్గిరో షికారులోనో, ఎక్కడో వాళ్ళని గుర్తించి పక్క చెట్టుమీద కూచుని పిలుస్తాడు అతని కంఠం తక్కిన గోరింకల కంఠాలకన్న వేరు. ఏమైనా



, నర్తకి గుర్తించగలరు అతని కంఠాన్ని. రోజు అతను వీళ్ళ పిలుపులకి ఆగలేక ఓ నిమి పీద దూకుతాడేమో ననిపిస్తుంది. కాని అతని వెంట గోరింకలు అతన్ని వెళ్ళవద్దని గట్టిగా గోల చేస్తాయి. అతనిపైన అంత ప్రేమ యెందుకో వాటికి! వాటికి చురు కథలు చెపుతాడేమో!

గుడ్లు పెట్టే ఋతువు వచ్చిందనీ అందుకు వెళ్ళాడనీ, పెద్దవి కాగానే తిరిగి వస్తాడనీ కొందరి ఆశ.

ఈ మధ్య ఓ నాలుగైదు రోజుల్నించి పిలిస్తే ఆ ళ్ళి వదిలి యింటివేపు కొంచెం కదులుతున్నాడు.

అతను వెళ్ళాక, చుట్టుపక్కల వాళ్ళు యెవరు నా వాళ్ళు అతను తిరిగి వచ్చాడా అని అడుగుతారు. లో మిత్రులందరూ అతని సంగతే అడుగుతారు. లో యేముందో యింత ప్రియుడు కావడానికి!

అతను వుండగానే ఓ రెక్క విరిగిన గోరింక వకటి వచ్చింది కదా! ఆ గోరింక వచ్చి రెండు నెలలయింది. కాని మైన తెలివి కనపడదు ఆమెలో. మొహంలోనే ఆ

వికాసం లేదు. అతని ప్రత్యేకత యేదన్నా పూర్వ
విశేషం వల్ల కలిగిందా? రెండు నెలల్లో అతనెం
వంతుడూ, ప్రేమాస్పదుడైనాడో? మరి తిరిగి వస్తా

సేవా

రమణ నగర్

అరుణాచ

9-12-1958

P. S. :- ఈ బుజ్జిగాడి చరిత్రని రాసి పు
అందరికీ వినిపిస్తున్నాడు నాన్న. ప్రతిరోజూ సాయం
నాలుగు నించి నాలుగున్నర దాకా ఆ వేళకి ఓ చె
చెట్టుపైనో బుజ్జిగాడు క్లిక్, క్లిక్ మంటో వుంటాడు.
నంత సేపూ! వరసగా వస్తున్నాడు. మధ్య రెండు రో
చదవలేదు. అతనూ రావడం మానేశాడు.

అతను వచ్చినప్పుడు అతని వెంట మిత్రుల గు
వుంటుంది. వాళ్ళతో చెపుతున్నాడు "వినండి, వాళ్ళ
వేది నా చరిత్రేనని! లేక నాన్న చదివే మాటలకి
వాళ్ళ భాషలో వాళ్ళందరికీ చెపుతున్నాడా ?



# చివరిమాట

నిన్ను గురించి కథ రాయాలని చాలాకాలం నించి నా మెదడు అడుగు పొరుగులలో మెదులుతూవుంది. నిన్ను గురించి యేం కథ రాయను బుజ్జీ ! యేం రాస్తే వీళ్ళకి అర్థమవుతుంది? నిన్ను గురించి వాస్తవాన్నే రాసినా వీళ్ళు నమ్ముతారా ? బుజ్జీ ! యేం మనుషులు వీళ్ళు.

నిన్ను గురించి రాస్తే ఎవరు చదువుతారు బుజ్జీ ! ఎండిపోయిన హృదయాలకి నీ హృదయౌన్నత్యం ఎట్లా అవగాహన అవుతుంది ? యీ మనుషులు ఒకే కాన్పులో ముగ్గురు పిల్లలు పుట్టారంటే, పుట్టుకతోటే కవల పిల్లలు కలిసి వున్నారంటే చదువుతారు కానీ, మీ అమ్మ వెంబడి సిపాయి వలె గెంతుతూ నడుస్తా వంటే, ఆశ్రమానికి పోకుండా అడ్డు తగులుతూ వుంటావంటే, యే చెట్లలోనో,

నువ్వంటే, మీ అమ్మ నిన్ను "బుజ్జీ" అని పిలిస్తే కు కూ...అని పలుకుతూ వుంటావంటే, నీళ్ళు పెట్టిం స్నానం చేస్తూంటా వంటే, మంచి పాటల్ని రమ్య రేడియోని పెడుస్తూంటా వంటే, ఆషా పాటతో నువ్వు పాడుతుంటా వంటే, ఏ రకపు చదలు కా చెపుతుంటావంటే, ఎంతో అప్యాయంగా చారుని తా వంటే, ఎవరు వింటారు బుజ్జీ ? విన్నా ఎవరు విశ్వసిస్తా

నిన్ను గురించి వాళ్ళు తెలుసుకోవాలనీ, నీ అ హతమైన మేధా సంపత్తిని చూచి అందరూ మెచ్చుకోవా నా తెందుకీ ఆరాటం బుజ్జీ !

నిన్ను చూసి జీవితానికేదన్నా విలవను మనుష్యు తెచ్చుకుంటారని ఆశ. అట్లా ఆశపడే నీ ఫోటోల్ని చూ చాను బుజ్జీ ! నిన్ను చూసి వాళ్ళేం మెచ్చుకున్నా! నువ్వు వాళ్ళకేం అర్థం అయ్యావు ? నీ రూపాన్ని చూ వాళ్ళకేం ఆనందం కలిగింది ?

నెమలి మెడమీద నీలిరంగుని చూసి ఆహా ! అంటా కాని మెరిసే నీ రెక్కల మీది ధవళకాంతిని చూసి ము పోరు కదా !



కిల కంఠం మాధుర్యంగా వుంటుందని తన్మ స్తారు కాని, నీ కూతల్లోని వింత సంగీతాన్ని విని చలేరు కదా !

ఆర్ద్ర పురుగుల రంగుని చూసి మూర్ఛపోతారు పొట్ట కింద మెరుపుని చూసి ఎవ్వరూ సంతోషించరు !

నెమలి కన్నుని చూసి భద్రంగా దాచుకుంటారు కాని పక్కనున్న సాలీడుగూడు లాంటి పొర ఎవ్వరికీ రలేదు కదా !

మయూరం పింఛం విప్పితే కళ్ళని బండి చక్రాలంత చూస్తారు కాని నీ తోకలోని అయిదు యీకల్ని గా పేర్చుతూ వుంటే నువ్వు, ఎవరూ చూడరు !

యీ మనుష్యుల్లో రసికత్వముందట! వీళ్ళవి కళా స్వదూలట: అందాన్ని చూస్తే వీళ్ళడెందం నిలవదట! న్ని చచ్చు కబుర్లు బుజ్జీ !

ముత్యాలలాంటి చదల్ని నువ్వు తింటుంటే ఎంత గా వుంటుందో, త్వరత్వరగా నోటినిండా కుక్కుకొని, గెత్తే యీ మనుష్యులకి ఎట్లా తెలుస్తుంది ?

వీళ్ళు ఎన్ని పుస్తకాలు చదువుతారు బుజ్జీ !

వొక్క అక్షరం వీళ్ళకి అర్థమవుతుందా! ...
యిన్ని డిగ్రీలు ప్యాసయినా వీళ్ళకి టాగోర్ ఏం...
మయ్యాడు బుజ్జీ ! నువ్వేమీ చదువుకో కుండానే టాగో...
ఎంత బాగా అర్థం చేసుకుంటావు? టాగోర్ గీతాంజ...
నోబుల్ ప్రైజ్ వొచ్చిందని గొప్పలు చెప్పుకోటమే గా...
గీతాంజలిలోని మాధుర్యం వీళ్ళేం ఆస్వాదించారు బు...
గీతాంజలిలోని మాధుర్యాన్ని నువ్వు విని, ఎంత ఆనంద...
రూస్తావు బుజ్జీ ! యే గొప్ప కవిత్వాన్ని వీళ్ళకి వినిపించినా
నీ అంత ఆనందం వీళ్ళకి రాదు కదా ! కవిత్వాన్ని గ...
క్షేపానికి చదవటమే కాని, నీలాగ, దానిలో లీనమ...
కవితా హృదయం వీళ్ళ కెక్కడుంది బుజ్జీ !

టాగోర్ బ్రతికుంది నిన్ను చూస్తే గీతాంజలిని ...
మానస హస్తాలకి అప్పచెప్పేవాడా ? ఆ Manuscript ...
నీకు పదే పదే శాంతినికేతనంలోని చంపా వృక్షం కి...
క్రింద చదివి, వినిపిస్తూ, నీ ఆహ్లాదాన్ని చూసి ఆనంద...
టాగోర్ నాట్యం చేసి వుండేవారు కాదా బుజ్జీ !

బుజ్జీ ! నిన్ను గురించి కథ రాస్తే ఎవరు చదువుతా...
బుజ్జీ ! అయినా నిన్ను గురించి ఏం రాయను బుజ్జీ !

నువ్వేమన్నా ప్రసిద్ధ ఆంధ్ర కథానాయకుడవా! ...
ప్రియురాలి మెల్లకన్ను మీద కవిత్వాలు రాసి షష్టి పూ...
మతహోత్సవం జరుపుకున్న కవికుల తిలకానివా? సమ్మేళ...



...గాలు చేయించి కీర్తిని సముపార్జించుకున్న రాజ
...సంధరుడవా? యివ్వేమీ కాదుకద! నిన్ను గురించి
...యుందని రాయను బుజ్జీ! నీది కళా హృదయమని, నీ
...లో సంగీతం వుందని నీ రూపంలో అందం వుందనీ
...పరు పట్టించుకుంటారు బుజ్జీ!

నిన్ను గురించి చెప్పాలనే ఆతురతను అణచుకోలేక
...ంధ్ర మిత్రులతో కాస్త చెబితే నన్నేమన్నారో తెలుసా
...నాట పిచ్చెక్కిందన్నారు బుజ్జీ! నీ ఫోటోల్ని
...చితే నన్నా, నిన్ను గురించి వింటారేమోనని ఆశపడి
...స్తే, డబ్బులన్నీ అనవసరంగా తగలేస్తున్నానని
...న్నారు బుజ్జీ!

కెమెరాను చూసి ఫోటో తీయమని నువ్వొచ్చి
...బాగా నిలబడ్డప్పుడు, డబ్బులూ, యివీ గుర్తుంటాయా
...! అయినా బుజ్జీ! యీ మనుష్యులు ఎన్నింటికి ఎంత
...వ్వు తగలెయ్యటం లేదు. వీళ్ళు వివాహాలకి ఎన్ని వేలు
...వ్వు పెట్టటంలేదు? ఆ వివాహాలలో యేం ఆనందం అనుభ
...స్తున్నారు బుజ్జీ! వివాహం చేసుకున్న ఒక్క మనిషి
...జీవన కళా కాంతులుండవు గదా!

ప్రతి నీ ఫోటోనీ చూసి నేనెంత స్పందించానో
నేనెంత మురిసిపోతానో వీళ్ళకి తెలియదు కదా! నీకై
పెట్టే ప్రతి అణాలోనూ నేనెంత ఆనందం అనుభవిస్తా
బుజ్జీ!

బుజ్జీ ఆనందం అనే మాటకు అర్థం తెలుసు
యీ మనుష్యులకి, ఆనందాన్ని అనుభవించటం
శతాబ్దాల క్రితమే మరిచిపోయారు బుజ్జీ!

ప్రతీ దాన్ని దాచుకోటమే తెలుసు కానీ యీ మను
ష్యులకి, దేన్నుంచి ఆనందాన్ని పొందలేరు బుజ్జీ! న
చూసి సిగ్గుపడక వీళ్ళు వెకిలిగా యికిలించారు బుజ్జీ!

అంతా శాశ్వతమనే భ్రమతో దేన్నుంచీ యేం
కుండా యీ మనుష్యులు జీవచ్ఛవాలై తిరుగుతూ
వొకనాడు యే శక్తో వీళ్ళనీ గడ్డలా తన్నుకుపోతూ
అయ్యో అని యేడుస్తారు కాని బుజ్జీ నీతో ఆడుకోరు క

నీతోనే కాదు. నీలోని అమాయకత్వం ప్రతి పాపా
లోనూ వుంటుంది. యే వొక్క పాపాయితోనూ యే
ఆడుకోడు బుజ్జీ! తమలాగే కావాలనే మూర్ఖమైన
నతో పాపాయిలోని దైవత్వాన్ని ధ్వంసం చేసి



యను, ద్వేషాన్ని, మాలిన్యాన్ని పోసి పెంచుతారు.
ఇంక యీ మనుష్యులు నిన్నేం ప్రేమించుతారు
!

ఇలాంటి మనుష్యుల మధ్య నేను బ్రతికిన ఆ రోజుల్లో
ని మానవత్వం నాశనమయి నన్ను నమ్మి నా చేతు
వొచ్చిన పిట్టల్ని, కోళ్ళనీ, దగ్గరుండి గొంతు కోయించి,
ం పోతుంటే అవి ఆ బాధను సహించలేక దీనంగా
స్తుంటే విని సంతోషించే రాక్షసత్వం నాలో వున్నా
న్న నీ సేవకుణ్ణిగా అంగీకరించి ప్రేమిస్తున్నావంటే నీలో
క దయ వుందో కదా బుజ్జీ!

నీవు నా చేతికి దొరికావని నిన్ని ప్రపంచంలో
గా బ్రతికేటట్లు చేయాలనే దారుణమైన కాంక్షతో నీ
దమైన దేహాన్ని ఎంత కర్కశంగా పట్టుకొని నిన్ను
కాశంలోకి విసిరాను?

నీవా ఆకాశంలో నుంచి పడిపోతావనే భయంతో
క్తినంతా నీ రెక్కల్లోకి తీసుకుని గిలగిల కొట్టు
టుంటే నువ్వు ఎగరటం నేర్చుకుంటున్నావని యికి
ంచిన నన్ను అంతా మరిచిపోయి ప్రేమిస్తున్నావంటే
దెంత మార్దవమైన హృదయమో కదా బుజ్జీ!

నాలోని మూర్ఖత్వాన్ని, రాక్షసత్వాన్ని,
శత్వాన్ని క్రమంగా పోగొడుతూ నన్ను ప్రసూనంగా
సింప చేస్తున్నావు బుజ్జీ!

కనం, అనే యీ మానవుల గాజు కళ్ళకు
రసమయ కళాఖండాల్ని ఎట్లా చూపించను బుజ్జీ!

వినం, అనే యీ మానవుల వీనులకు యీ
గాంధర్వాన్ని ఎట్లా వినిపించను బుజ్జీ!

నిన్ను గురించి ఏం కథ రాయను బుజ్జీ!

కురంగ

—o—